# నాలుగు రోడ్లు

(కథాసంపుటి)

అనువాదం

ఎస్. ఆర్. చందూర్

S. R. Chandur



ప్రతిమా బుక్స్

49 మూకతాల్ వీధి

మద్రాసు - 7

NALUGU ROADLU
Protima Books, Madras 7

May 1955

TL
O35,3N8D,N
35N55

Telugu Translation of Stephen Vincent Benet's 'The Devil and the Deep Sea' (Publisher: Rinehart & Co), Willa Cather's 'Neighbor Rosicky (Publisher: Alfred A. Knopf Inc), Stephen Crane's 'The Open Boat' (In the Public Domain) and Truman Capote"s 'Children on their Birthdays' (Publisher: Random House) - four stories. Translated and published by kind permission of the respective authors and publishers.

ముద్రణ:
శ్రీ రామా అండ్ కో. - భారతమాత ప్రెస్
39 అండర్సన్ వీధి, మద్రాసు - 1

# ఎస్. ఆర్. చందూర్ మిగతా పుస్తకాలు

బాలరాజ్యం
శిక్ష
అంతేనా
కాఫీ మానెయ్యడం
ఎక్కడికి కమలా?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినిమాకి
నట్టింటదీపం

మాంగుటూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతాఫలాలు
భాష
పరిచయం చేసిన పుస్తకాలు
పూసల మేడ
అన్యాయం
శివరావు
ఆఖరు కోరిక
కలడో లేడో

గ్రామవైద్యుడు
అణుశక్తి
ప్రతి గురువారం

# న్యాయవాది

## స్టీఫెన్ విన్సెంట్ బినెట్

## (1898 - 1943)

అమెరికను సివిల్‌వార్ గురించి స్టీఫెన్ విన్సెంట్ బినెట్ రాసిన పద్యకావ్యానికి 1929 లో పులిట్జర్ ప్రయిజ్ వచ్చింది. ఈయన మంచిమంచి కథలూ, చక్కటి పద్యాలూ రాశాడు.

జానపద గాథల్ని ఆధారంగా చేసుకు కథలుఅల్లాడు; ప్రతికథకీ వేళ్లు జానపద జీవనంలో వుంటాయి - ఆ ప్రకారం రాశాడాయన. మీరు చదవబోయే "న్యాయవాది"లో పర దేశిపేరు మిస్టర్ స్క్రాచ్. దెయ్యాన్ని 'మిస్టర్ స్క్రాచ్' అంటూండేవారట ఒకప్పుడు, న్యూ యింగ్లండు రాష్ట్రంలోని అమెరికనులు.

★

# న్యాయవాది

సరిహద్దు ప్రాంతంవారు ఈ కథని ఈనాటికీ చెప్పు కుంటున్నారు. డేనియల్ వెబ్‌స్టర్ అస్తికలు భూమిలో కలిసిపోయి చాలాకాలమయింది. కాని, మార్ష్‌ఫీల్డ్ చుట్టు పక్కల పిడుగులవర్షం పడ్డప్పుడు, అతని కంచుకంఠం ఆకాశాన్ని చీల్చుకు వినిపిస్తూంటుందట.

అతను సమాధిచేయబడ్డ స్థలందగ్గిరికి వెళ్ళి, ఆసమాధిని ఉద్దేశిస్తూ, "డేనియల్ వెబ్‌స్టర్! డేనియల్ వెబ్‌స్టర్!!" అని బిగ్గరగా పిలిస్తే, నేల జలదరిస్తుందట; చుట్టూవున్న చెట్లు వణుకుతాయట. కాసేపయాక ఒక గంభీరనాదం, "సోదరా, యూనియన్ ఎలావుంది?" అని అడుగుతుందట. అప్పుడు మీరు, యూనియన్ నిశ్చలంగా, చెక్కుచెదర కుండా, ఒకటిగా ఒకేమాటగా, నిలబడివుందని అనాలి. అనకపోతే ముందుకి బోర్లగిల పడతారు. నిజమా అని నిలవ దియ్యకండిగాని, నా చిన్నతనంలో నాకు అలాచెప్పారు.

ఆ ప్రాంతంలో అతను చాలా పెద్దవాడు, - ప్రెసిడెంట్ అవలేదుగాని చాలా పెద్దవాడు. వేలాదిప్రజలు మొదట భగవంతుడినీ, తర్వాత అతన్నీ నమ్మేవారు. అతని గురించి ఎన్నెన్నో కథలు చెప్పుకునేవారు.

అతను వేదికఎక్కి మాట్లాడటం మొదలెట్టేటప్పటికి ఆకాశవీధిలో "స్టార్స్ అండ్ స్ట్రియిప్స్" ప్రత్యక్షమయేవట. అతని వాక్పటిమకి ఒకసారి, నదీప్రవాహం భూగర్భంలోకి పారిపోయిందట.

అలాటిమనిషి అతను. మార్ష్‌ఫీల్డ్‌లో అతనికో పెద్ద "ఫారమ్" వుండేది. అతని కోడిపెట్టలు మహాముచ్చటగా వుండేవి. పిల్లల్ని పెంచిన మాదిరిగా పెంచేవాడు ఆవుల్ని. గోలియాత్ అనుపేరుతో అతను పిలుచుకునే గొర్రెపొట్టేలు కొమ్ములు, సుడులుతిరిగి వుండటమేగాకుండా, యినుప ద్వారాన్ని ఛేదించగలిగినంత వాడిగా వుండేవి.

బట్టలు మాయకుండా వ్యవసాయం చేయాలనే రకం కాదు డేనియల్. భూమాత ప్రియసుతులలో అతనొకడని చెప్పవచ్చు. ఆ ధగధగమనేకళ్లూ, ఆ పర్వతంలాటి నుదురూ, ఆ గడగడలాడించే నోరూ అందరికీ సుపరిచితమే!

అతను వాదించిన కేసుల్లోకల్లా పెద్దది, లా పుస్తకాల్లోకి ఎక్కనేలేదు. ఎంచేతనంటే, అతను వాదించింది మానవ మాత్రులతో కాదు - దెయ్యంతో. ఆ కథని ఈ విధంగా చెప్పుకోవడం విన్నాను.

న్యూహాంప్‌షైర్‌లో, క్రాస్ కార్నర్స్ అనుచోట, జాబెజ్ స్టోన్ అనే అతను వుంటూండేవాడు. అతన్ని చెడ్డవాడనడం భావ్యంకాదు - దురదృష్టవంతుడు. అతను

ధాన్యం చల్లితే పంటపాడయేది; బంగాళదుంప నాటితే చీడ పట్టేది. బోలెడంత భూమిఉంది; కాని అది అతన్ని వృద్ధిలోకి తీసుకొచ్చేదికాదు. భార్యాపిల్లలు కలవాడు. పిల్లల సంఖ్య పెరిగినకొద్దీ వాళ్లకి తగ్గతిండి పెట్టలేకపోతూండేవాడు. పక్కవాడి పొలంలో గులకరాళ్లు అగుపిస్తే, యితని పొలంలో గండశిలలు అగుపించేవి. కొందరు దురదృష్టవంతుల బతుకంతే! జాబెజ్ స్టోన్‌కి తన బతుకుమీద విరక్తి పుట్టింది.

ఒకరోజు ఉదయంవేళ పొలం దున్నుకుంటున్నాడు. నాగలి ఖేడీమని రాతికి తగిలి, విరిగివూరుకుంది. అమాంత్రం మొలుచుకొచ్చిందారాయి. నాగటికర్ర విరిగిపోవడంతో, నాగలి లాగుతున్న గుర్రం నాలుగడుగులు ముందుకేసి, దగ్గుతూ నిలబడింది. గుర్రం దగ్గిందంటే, దానికేదో వ్యాధి పట్టుకుందన్నమాటే! ఇంట్లో యిద్దరు పిల్లలకి అమ్మవారు పోసింది; భార్యకి సుస్తీగాఉంది; తనకి బొటనవ్రేలుమీద గోరుచుట్టులేచింది. ఇంకేంకావాలి? ‘‘మనిషి తన ఆత్మని పిశాచాలకి అమ్ముకునేందుకు యింతకంటె ఏమీఅక్కర్లేదు. నామట్టుకునేను, ఆత్మని అమ్ముకునేందుకు సిద్ధంగావున్నాను,’’ అంటూ నాలుగువైపులా కలయజూశాడు.

తను అన్నమాటలు, తన చెవులకి విపరీతంగా తోచాయి. తను న్యూహాంప్‌షైర్ మనిషి. ఆత్మని పిశాచాలకి అమ్ముకుంటానన్నాడు. పోనీ, అమ్ముకుంటాడు.

అంతేగాని, అన్నమాట తప్పడం దేనికి? సాయంత్రందాకా చూశాడు. తన ఆత్మని కొనేందుకు ఏ పిశాచమూరా లేదు. అక్కడితో మనసు కాస్త తెరిపిని పడ్డట్టయింది.

మర్నాడు సాయంత్రం భోజనాలవేళ, మంచిబట్టలు వేసుకున్న అపరిచితవ్యక్తి ఒకడు, చక్కటి గుర్రబ్బగ్గీలో వచ్చి, - జాబెజ్ స్టోన్ ఉన్నారా? - అని అడిగాడు.

తనకి సంక్రమించబోయే ఆస్తివిషయమై మాట్లాడ టానికివచ్చిన ప్లీడరుగారు ఆయన, - అని అబద్ధంచెప్పాడు జాబెజ్ యింట్లోవాళ్లకి. కాని, జాబెజ్‌కి తెలుసు అతనెవరో. ఆ పరదేశి చూపు లెందుకనో విషపూరితంగా ఉన్నాయి; అతను తన పలువరస ప్రదర్శిస్తూ నవ్వుతున్నాడు. జాబెజ్ పెంపుడుకుక్క పరదేశినిచూసి బిగ్గరగా మొరిగి, తోక ముడిచి, పారిపోయింది.

జాబెజ్, ఆపరదేశీ ధాన్యపుకొట్టు వెనకవైపులకి వెళ్లారు మాట్లాడుకునేందుకు. బేరసారాలు అయాయి. సంతకం పెట్టేందుకు జాబెజ్ తనవేలు సూదితో గుచ్చు కోవాలి. గుచ్చుకునేందుకు పరదేశి వెండిపిన్ను యిచ్చాడు.

జాబెజ్ చేతిమీది గాయం మానిపోయిందిగాని, తెల్లమచ్చ మాత్రం మిగిలింది.

ఆ తర్వాత జాబెజ్ స్టోన్ జీవితం, మొగ్గతొడిగి, పువ్వుపూసింది. అదృష్టం అందుకుంది. పక్కవారు అసూయ

పడేటంత పాడిపంటలూ, పశుసంపదాను. వానావరదలు అందర్నీ బాధించేవిగాని జాబెజ్ ధాన్యపుకొట్టు చాయలకి వచ్చేవికాదు.

తొందరలోనే అతను, ఆచుట్టుపట్లవారిలో భాగ్యవంతుడయాడు. మిత్రులు అతన్ని స్థానిక ఎన్నికల్లో నుంచోమన్నారు; నుంచోడ మేమిటి, నెగ్గడ మేమిటి! జాబెజ్‌స్టోన్ ప్రభుత్వఎన్నికల్లోకూడా నిలబడాలని ప్రచారం లేవదీశారప్పుడే! స్టోన్‌కుటుంబంవారు మహాసంతోషంగా ఉన్నారు. పాలదాలిపక్కన నివశించే పిల్లులు ఎంతహాయిగా ఉంటాయో, అలావుంది వాళ్ల స్థితి. అందరూ సుఖంగానే ఉన్నారు; జాబెజ్‌స్టోన్ ఒక్కడికే సుఖంలేదు.

మొదటిరోజుల్లో అతనికేమయినా తృప్తిగా ఉందేమో - అంతే! నిర్భాగ్యదేవత మనని వొదిలి వెళ్లిపోవడమే గొప్పవిషయం. కష్టకాలం పూర్తిఅయి, కాస్త పచ్చపచ్చగా రోజులు గడుస్తున్న మొదట్లో, ఏ ఆలోచనలూ రావు. కాని, కొన్నాళ్లయాక వస్తాయి. అయిదేళ్లు చక్కగా గడిచాయి. ఆరోఏడునుంచి అశాంతి పట్టుకుంది జాబెజ్‌స్టోన్‌కి.

చేతిలోవున్న పేముబెత్తంతో తన బూటుకాళ్లమీద తాళంవేస్తూ, పరదేశి పల్లపుపొలంలోనుంచి స్టోన్‌వున్న చోటుకి వచ్చాడు. పరదేశి వేసుకున్న నల్లటిబూట్లు నిగనిగ

లాడుతున్నాయి. ఆ బూట్లు ఎందుకనో జాబెజ్ స్టోన్‌కి బావుగా లేదు.

"శ్రేష్ఠమైన పొలం! బంగారం పండేపొలం," అన్నాడు పరదేశి.

"కొందరు మంచిపొలం అంటారు, కొందరు కొంచెం అంటారు," అన్నాడు స్టోన్.

పలువరుస ప్రదర్శించే నవ్వుతో పరదేశి అన్నాడు: "ఎవరుపడ్డ కష్టాన్ని వారు చిన్నబుచ్చుకో నవసరంలేదు. నువ్వు కష్టపడి ఈపొలాన్ని యింతవృద్ధిలోకి తీసుకొచ్చావ్! మన ఒప్పందం ప్రకారం తనఖా మళ్లీ ఏడాదికి తీర్చాలి కదూ!"

"ఆ తనఖా విషయంలో నాకు ఒకటిరెండు సంశయాలు ఉన్నాయి," అంటూ స్టోన్, భూమ్యాకాశాలవంక నిస్సహాయంగా చూశాడు.

"సంశయాలా?" అన్నాడు పరదేశి, మొహం చిట్లిస్తూ.

గొంతు సవరించుకొని, జాబెజ్ చెప్పాడు: "అవును - సంశయాలే! ఇది అమెరికాదేశం. నేను ముక్కుకి సూటిగా పోయేమనిషిని - దేవుడూ దెయ్యంమీద నమ్మకంగలవాణ్ణి. మీరు నాచేత రాయించిన తనఖా దస్తావేజు కోర్టులో చెల్లదు."

"కోర్టులు కావలసొచ్చాయా యిప్పుడు? ఎందుకు చెల్లదు కోర్టులో? భేషుగ్గా చెల్లుతుంది," అంటూ, కాయి తాల పెట్టెలోనుంచి దస్తావేజు బయటికి తీశాడు పరదేశి. "ఫలానావారి కుమారుడూ, ఫలానా గ్రామకాపరస్థుడూ అయిన నేను, జాబెజ్ స్టోన్‌ని, వ్రాయించియిచ్చిన తనఖా దస్తావేజు. నేటినుంచి ఏడుసంవత్సరములవరకు......... కోర్టులో ఎందుకు చెల్లదో చూస్తాగా!" అని బెదిరిస్తున్నాడు పరదేశి.

జాబెజ్ పరదేశి మాటలు వినడంలేదు. అతని దృష్టి ఎంతకీ, దస్తావేజుతోపాటు బయటికొచ్చిన ఒకజీవి మీదఉంది. అది చిమ్మెటలా కనిపించింది; కాని చిమ్మెట కాదు. జాబెజ్ దానినంకే చూస్తున్నాడు - కేంద్రీకృతదృష్టితో చూస్తున్నాడు. అతిసన్నని మానవకంఠంతో "సోదరా, నన్ను కాపాడవ్! నన్నురక్షించవ్!" అంటోంది ఆ స్వల్పప్రాణి.

జాబెజ్ తన చెయ్యా కాలూ కదపక పూర్వమే. పరదేశి తనసిల్కు జేబురుమాలులోకి ఆపురుగుని పట్టుకున్నాడు. సీతాకోక చిలుకని పట్టుకున్నట్టు పట్టుకొని. రుమాలుని మూలలనుంచి ముడివేశాడు.

జాబెజ్ అదిచూసి, బెదిరిన గుర్రంలా గడగడ లాడాడు.

"ఆకంఠం స్టీవెన్స్‌ది. రుమాలుతో అతని కంఠా నికి ముడివేసేస్తున్నావ్," అని మూలిగాడు జాబెజ్.

పరదేశికి అది అర్థంగాక వింతగా చూశాడు.

"వ్యాపారమంటే వ్యాపారమే. వ్యాపారంలో కని కరం పనికిరాదు," అన్నాడు పరదేశి.

సిల్కురుమాలు యింకా అతని చేతిలోనే వుంది. రుమాలులో యిరుక్కున పురుగు, తనప్రాణంమీద తీపితో, యిటూఅటూ కొట్టుకోవడం చూడలేక పోతున్నాడు జాబెజ్.

మనుషులు పురుగులంత స్వల్పప్రాణు లనుకున్నావా?- అని అడిగాడు.

"ఆ సిల్కురుమాలు అవతల పారేయ్," అని కాళ్లా వేళ్లాపడి బతిమిలాడాడు.

ప్రార్థనల ఫలితమేమిటంటే, మరొక మూడేళ్ళు టైము దొరికింది - మరికొన్ని షరతులతో.

అటువంటి లావాదేవీల్లో యిరుక్కున్నాకగాని 'మూడేళ్ళు' అనేది ఎంతవేగంగా పరిగెడుతుందో తెలి యదు. ప్రతి ఉదయం అనుకునేవాడు - మరొకరోజు గడిచి పోయిందిగదా అని! ప్రతిరాత్రీ పక్కమీదికి వొరగగానే, దస్తావేజూ స్టీవెన్స కంఠమూ జ్ఞప్తికొచ్చి, పరిపరివిధాల బాధపడేవాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ మనోబాధ ఎక్కువయింది. చివరి సంవత్సరం ఆఖరిరోజుల్లో, పరుగుపరుగున డేనియల్ వెబ్‌స్టర్ దగ్గిరికి వురికాడు. న్యూ హాంప్‌షైర్‌లోని క్రాస్ కార్నర్స్‌కీ, మార్ష్‌ఫీల్డ్‌కీ ఆట్టే దూరంలేదు. డేనియల్ వెబ్‌స్టర్‌కి యిరుగూ పొరుగూ అంటే మహాప్రీతి.

జాబెజ్‌స్టోన్ మార్ష్‌ఫీల్డ్ చేరుకునేవేళకి తెలతెల్లవారుతోంది. అప్పటికప్పుడే డేనియల్ నిద్దరనుంచిలేచి, తనపనివాళ్ళతో యిష్టాగోష్టి మాట్లాడుతున్నాడు. తనని చూడటానికి న్యూ హాంప్‌షైర్ మనిషి వచ్చాడని వినగానే, ఎక్కడపని అక్కడ వొదిలేసివచ్చి, అతిథిని ఎంతో ఆదరంతో ఆహ్వానిస్తూ లోపలికి తీసుకువెళ్ళాడు. డేనియల్ వెబ్‌స్టర్ పద్ధతేఅంత. అయిదుగురు తినగలిగినంత ఆహారపదార్థాలతో జాబెజ్‌స్టోన్‌కి విందుచేసి, క్రాస్‌కార్నర్సులోని స్త్రీపురుషులు యీావన్మంది చరిత్రా అడిగి, తను తన అతిథికి చేయగలసాయం ఏదైనావుంటే చెప్పవలసిందిగా కోరాడు.

జాబెజ్ తనదొక తనఖా వ్యవహారమని చెప్పాడు.

"నేను తనఖా కేసులు వాదించి చాలాకాలమయింది. ఈ రోజుల్లో నేను సుప్రీమ్‌కోర్టు కేసులు మినహా మరేవీ పట్టడంలేదు. అయినా, నాకు చేతనైన సాయం, నేను తప్పకుండా చేస్తాను," అన్నాడు డేనియల్ వెబ్‌స్టర్.

"పదేళ్ళ ఈమధ్య కనిపించని ఆశాకిరణం మొట్ట

మొదటిసారిగా కనిపిస్తోంది,'' అన్నాడు జాబెజ్.

డేనియల్ జాబెజ్ వంక చూసి చిరునవ్వు నవ్వాడు. పర్వతాలచాటునుంచి సూర్యోదయమైనట్టు వుంది ఆ చిరు నవ్వు.

''పిశాచాల పిడికిట్లోకి వెళ్లి ఇరుక్కున్నావ్, సోదరా! నేను నీ కేసు పడతాను. ఏమీ భయపడకు.''

''డేనియల్ వెబ్‌స్టర్ నా కేసు పట్టడమే!''

''అవును. డెబ్బయ్యయిదు యితర కేసులు నిర్వహించాల్సివుంది. అయినప్పటికీ నేను నీ కేసు తీసుకుంటున్నాను.''

డేనియల్ వెబ్‌స్టర్ అంతవాడు తమయింటికి వచ్చేటప్పటికిప్పటికి, జాబెజ్ కుటుంబంలోనివారి సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయి. భోజనాలయాక ఎవరిగదుల లోకి వాళ్ళు వెళ్ళిపోయారు - ప్లీడరుగారూ క్లయింటూ మట్టుకే వ్యవహారం మాట్లాడుకునేందుకు దిగడిపోయారు. ముందు వరండాలో కూచుని మాట్లాడుకోమంది మిసెస్ స్టోన్. కాదు, వెనకనున్న వంటవసారాలో కూచుంటాం - అన్నాడు డేనియల్ వెబ్‌స్టర్.

ఇద్దరూ వంటవసారాలో కూచుని, పరదేశి రాక కోసం, ఎదురుచూస్తున్నారు. నిప్పులకుంపటి భగభగమండు తోంది. రాత్రి పన్నెండూ కొట్టేవేళకి వస్తానన్నాడు ఆ పరదేశి.

డేనియల్ వెబ్‌స్టర్‌లాంటి మనిషి సరసని కూచుని కబుర్లు చెప్పుకోవడంకంటె కావలసినదేముంది? కాని, గడియారం టిక్ టిక్ మంటున్నకొద్దీ, జాబెజ్ మొహం వాడిపోనారంభించింది. నిముషాలు గడుస్తున్నకొద్దీ అతని కళ్ళు కాంతివిహీనంకాసాగాయి. పదకొండున్నర కొట్టారు. జాబెజ్ విపరీతంగా భయపడుతూ యిలాఅన్నాడు.

"మిస్టర్ వెబ్‌స్టర్, మిస్టర్ – మీరు పారిపొండి. మీ గుర్రబ్బగ్గీమీద ఎంతవేగంగా వెళ్ళిపోవడానికి వీలువుంటుందో, అంతవేగంగా వెళ్ళిపొండి. న్యూ హాంప్‌షైరుకి మీరు మణిపూసలాటివారు. మీలాటివారు యూనియన్‌ని రక్షించాలి. ఆ దుష్టుడికంట పడకూడదు మీరు."

"ఈ సంగతి చెప్పేందుకా, సోదరా, నన్ను యింత దూరంనుంచి తీసుకొచ్చావ్?" అని ఏమాత్రం చలించకుండా అన్నాడు న్యాయవాది.

సరిగ్గా అదేక్షణముకి తలుపుతట్టిన శబ్దమయింది.

"మీ గడియారం కాస్త స్లో అనుకుంటాను," అని జాబెజ్‌తో అంటూ, తలుపు తెరిచేందుకు వెళ్ళాడు డేనియల్ వెబ్‌స్టర్.

నిప్పులకుంపటి వెలుగులో ఆ పరదేశి నల్లగాపొడుగ్గా వున్నాడు. అతనిచేతిలో నల్లని అట్టపెట్టె ఒకటివుంది. కత్తులూ కాయితంవుండే ఆ అట్టపెట్టెని చూసేటప్పటికి జాబెజ్

పై ప్రాణాలు పై కెగిరి పోవడంతో, గదిలో ఒకమూలగా వొదిగి కూచున్నాడు.

పరదేశికళ్లు, అర్ధరాత్రివేళ అడవిలో గుంటనక్క కళ్లు మెరిసినట్టుగా మెరుస్తున్నాయి. "తమరు మిస్టర్ వెబ్ స్టర్ అనుకుంటాను," అన్నాడు డేనియల్ వెబ్ స్టర్ని ఉద్దేశిస్తూ.

"అవును - జాబెజ్ స్టోన్ ప్లీడర్ని. తమ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు డేనియల్, మిలమిలలాడే నేత్రాలతో.

"నన్ను చాలా పేర్లతో పిలుస్తారు ఈ చుట్టుపక్కల వాళ్లు. ప్రస్తుత వ్యవహారానికి స్క్రాచ్ అను పేరుతో పిలవండి. ఆపేరుతోటే పిలుస్తున్నారు నన్ను ఈ ప్రాంతం వాళ్లు," అన్నాడు పరదేశి.

"ఇప్పుడు నేను మిమ్మల్ని కోరేదేమిటంటే, న్యాయ సూత్రాలమీద విశ్వాసంవున్న ఉత్తమపౌరులు కాబట్టి మీరు, నాఆస్తిని నాకు స్వాధీనం చేయించవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు పరదేశి తన పలువరస కనిపింప జేస్తూ.

సరి, ఇంక అక్కడితో వాదప్రతివాదాలు ప్రారంభ మయాయి. వాగ్యుద్ధం మహాతీవ్రంగా సాగింది. డేనియల్ వెబ్ స్టర్నే నమ్ముకున్నాడు జాబెజ్. కాని, పరదేశి

వాదబలం ఏమంత తీసిపోవడంలేదు. వాళ్ల వాగ్వాదం తీవ్ర స్థాయినందుకుంటున్నకొద్దీ, జాబెజ్ గుండె దడదడలాడేది. అతని కళ్లన్నీ అట్టపెట్టెమీదే!

ఘుట్టిచిక్కు ఎక్కడంటే, దస్తావేజు అబద్ధంకాదు; దస్తావేజుమీద జాబెజ్ సంతకం అంతకంటె అబద్ధం కాదు. డేనియల్ వెబ్‌స్టర్ ఎన్ని మెలికలువేసి, ఎన్నివంకరులు తిప్పినా, ఎన్నిసార్లు బల్లగుద్దినా, ఆ "నిజం" (fact) నుంచి పారిపోవడానికి వీలులేదు. అందుకని రాజీపడదామన్నాడు - కాని పరదేశి వొప్పుకోలేదు.

ఆ స్థిరవిలువ మునుపటికంటె యిప్పుడు ఎన్నోరెట్లు పెరిగిందన్నాడు డేనియల్. కాని, పరదేశి అనడం మాటలతో పనిలేదనీ, కాయితంలో ఎలావుందో అలా జరిపించి తీరాలనీ అంటున్నాడు. డేనియల్ వెబ్‌స్టర్ సమర్థుడైన ప్లీడరే, అతనికి సమానవుజ్జీగా కనిపిస్తున్నాడు ఈ పరదేశి.

చివరికి పరదేశి చిన్న ఆవలింత ఆవలించి యిలా అన్నాడు: "మిస్టర్ వెబ్‌స్టర్, మీ క్లయింటు తరఫున మీరు జరిపినవాదం, మీ ప్రజ్ఞావిశేషాన్ని కొనియాడుతోంది. ఇలావాదిస్తూ కూచునేందుకు నాకు టైములేదు. అంచేత, వ్యవహారం తొందరగా తెమిలిస్తే..."

ఆ మాటలు వినేటప్పటికి జాబెజ్ గడగడలాడాడు.

డేనియల్ వెబ్‌స్టర్ నుదురు నీలమేఘమంత నల్లగా అయిపోయింది.

"మీకు క్లైమువుందో లేదో నాకనవసరం. నా క్లయింట్ అయిన జాబెజ్ స్టోన్ అమెరికను పౌరుడు. అమెరికను పౌరుని ఆస్తిపాస్తుల్ని ఏపరదేశీ ఈవిధంగా లాక్కోవడం అమెరికా వొప్పుకోదు."

"నేను పరదేశినా? ఎవరన్నారా మాట? నేను పరదేశి నెందుకవుతాను?" అన్నాడు పరదేశి స్వల్ప కోపంతో.

"మీరు యింతవరకూ అమెరికన్ సిటిజన్ షిప్ కోరనప్పుడు పరదేశి ఎందుకుకారు?"

పలువరుస ప్రదర్శించే గ్రాహ్యాంశమైన చిరునవ్వు ఒకటిపారేసి, పరదేశి అన్నాడు: "నేను అమెరికన్ని కానని ఎవరనగలరు? నాపేరు తెలియనివాళ్లు లేరే! ఎటొచ్చీ, నేను మీ అందరికిమల్లే బడాయిలు చెప్పుకోవడంలేదు."

డేనియల్ వెబ్‌స్టర్ కణతలు వుబ్బాయి. "అయితే, నాక్లయింట్ కేసు, న్యాయస్థానంలో విచారించవలసి వుంటుంది."

"మామూలు కోర్టువారు పరిశీలించదగ్గ కేసుకాదు యిది. అదీగాక, ఈ అర్థరాత్రివేళ..."

"ఎలాంటివేళప్పుడైనా సరే, ఎటువంటి కోర్టయినా

సరే - అమెరికన్ జడ్జీ, అమెరికన్ జ్యూరీ అయితే చాలు - వారి తీర్పుకి మేము బద్ధులమైవుంటాం,'' అని బింకంగా పలికాడు డేనియల్ వెబ్‌స్టర్.

"సరే - మీరన్నప్రకారం,'' అంటూ పరదేశి తలుపువైపు చూపించాడు. తలుపు తెరిచేటప్పటికి ఈదురుగాలి రివ్వున కొట్టింది. ఆ ఈదురుగాలి పాదాల చప్పుడుని కూడా పట్టుకొచ్చింది. క్షణక్షణానికీ పాదాలచప్పుడు మరీ దగ్గరకా నారంభించింది. అది మనుషుల అలికిడే, మనుషులు నడిచివస్తున్నారు. కాని, ఆమనుషులు సజీవులో విగతజీవులో తెలియడంలేదు. నిప్పుల కుంపటి నీలంగామండుతోంది. తలుపు బార్లా తెరుచుకుంది. పన్నెండుగురు మనుషులు, ఒకళ్లతర్వాత ఒకళ్లుగా, లోపలికి ప్రవేశించారు.

జాబెజ్‌కి నవనాడులూ కుంగిపోయాయి. యూనియన్ విద్రోహి వాల్టర్‌బట్లర్, ప్రజలని చిత్రవధచేసే సైమన్ గిర్టి, సముద్రపు ఓడలు కొల్లగొట్టే టీచ్ - యిలాటి వాళ్లంతా ఉన్నారు. వాళ్లందరిపేర్లూ వరసవరసని చెప్పాడు పరదేశి. ఒక్కొక్కడొక కిరాతకుడు.

"ఈ జ్యూరీ మీకు సమ్మతమేనా, మిస్టర్ వెబ్‌స్టర్?'' అని వెటకారంగా అడిగాడు పరదేశి.

డేనియల్ వెబ్‌స్టర్‌కి నుదురు అంతా చెమటపట్టింది గాని కంఠంమట్టుకు బింకంగా ఉంది.

"ఓ - సమ్మతమే. బెనిడిక్ట్ ఆరోనాల్డ్ కూడా న్యాయంగా బావుండేది," అన్నాడు డేనియల్ వెబ్‌స్టర్. (బెనిడిక్ట్ ఆరోనాల్డ్ ఒకటో నెంబరు దేశద్రోహి).

జాబెజ్ చెప్పుకోవలసిందేమీ లేదు. అతనినోటమ్మట మాటవస్తేగదా! ఈ పన్నెండుగురు "మహాపురుషుల్ని" చూసి, ఒక్కసారి కీచుమని అరిచి, నిస్త్రాణతో మూర్ఛలో మునిగిపోయాడు జాబెజ్.

అంతమాత్రాన న్యాయవిచారణ ఆగలేదు; దాని దారిని అదిసాగింది. డేనియల్ వెబ్‌స్టర్ రకరకాల జడ్జీలనీ జ్యూరీలనీ చూశాడుగాని, యిలాంటి దేవాంతకులతో కూడిన జ్యూరీని ఏనాడూ చూడలేదు.

నిశ్చలంగా కూచున్నారు పన్నెండుగురూ. పరదేశి తన కేసు చిలవలూ పలవలూతో చెప్పుకున్నాడు. డేనియల్ వెబ్‌స్టర్ ఏదైనా అభ్యంతరం చెబుతున్నప్పుడు, జ్యూరీ ఆ అభ్యంతరాన్ని ఆమోదించేవారు కాదు; అదేగనుక పరదేశి విషయంలో అయితే, ఆమోదిస్తూండేవారు. డేనియల్ వెబ్‌స్టర్ ఏదో నడుం కట్టాడన్నమాటేగాని, ఆ వచ్చిన వాళ్ళందరూ పరదేశి తరఫువాళ్ళు గదా!

పరదేశి చెప్పుకోవలసిందంతా చెప్పుకోవడం అయిపోయింది. డేనియల్ వెబ్‌స్టర్ నిలబడ్డాడు. కణకణలాడే

యినపకడ్డీలా వున్నాడు మనిషి. నోరు మెదిపితే, యింక ఉరుములూ మెరుపులూ వెలువడుతాయి. చీకట్లో నడు స్తున్న మనిషి గోతిలో పడబోయి తప్పించుకున్నట్లు, ఒక్క-సారి నుదుటిమీది చెమటని తుడుచుకు, మాట్లాడదలుచు కున్నది మాట్లాడకుండా ఆగాడు.

వాళ్ళందరూ పరదేశికోసం వచ్చారు; జాబెజ్ స్టోన్ గురించిన చింత అందులో ఒక్కడికీలేదు. పరదేశి మాట్లాడే విధానం, ఆ పన్నెండుగురితీరూ - ఈ విషయాన్ని సుస్పష్టం చేసింది. వారి దగ్గిరవున్న ఆయుధాలే తను వుపయోగించి లాభంలేదు. తనలోని రౌద్రజ్వాలే వారికళ్ళలో వెలుగై మండుతోంది. ఆ వెలుగుని తను తుడిచెయ్యాలి. అందుకని మెత్తని కంఠంతో, చాలా సౌమ్యంగా మొదలుపెట్టాడు.

ప్రతిపలుకూ సుస్పష్టంగా వినిపించేటట్టు చెప్పనారంభించాడు. తీగెమీద సంగీతం పలికించినట్టున్నాయి ఆ మాటలు. పొగడ్తలుగానీ నిందలుగానీ లేవు అందులో. దేశమంటే ఏమిటి, మనుషులంటే ఏమిటి - అని విడమరిచి చెబుతున్నాడు.

అందరికీ తెలిసే లేత విషయాలతో ప్రారంభించాడు. వయసులో వున్నప్పుడు అర్థమయే ప్రత్యూష సౌందర్యం, ఆకలిగా వున్నప్పుడు హితవయే ఆహారపదార్థం, బాల్యంలో ఉన్నప్పుడు బోధపడే అనుదిన ఆనందం - యివి అందరికీ

తెలిసేవి, అందరూ వొప్పుకునేవి. మంచివస్తువులు అందరికీ మంచివే. అందుకు సంశయం లేదు. కాని, ఆ మంచివస్తువులుకూడా మానవునికి స్వాతంత్ర్యం లేనప్పుడు చెడుగా పరిణమిస్తాయి. బానిసత్వమే బాధలన్నిటికీ మూలకారణం. బానిసత్వం గురించి మాట్లాడుతున్నప్పుడు, అతని కంఠం కంచు గంటలా మోగింది.

అమెరికాదేశపు మొదటి దినాలగురించి చెప్పాడు. నాలుగు వైపులకీ చాచుకుపోదాం - అని ఉపన్యాసాలు దంచే మనుషులుకాదు, ఆనాటి మూలపురుషులు. వాళ్ళు తప్పులు చెయ్యకపోలేదు. తప్పులుచేశారు, పొరబాట్లు చేశారు. ఆ తప్పులనుంచీ, పొరబాట్లనుంచీ, ఆ శ్రమదమాల నుంచీ కొత్తదైనది ఒకటి ఉద్భవించింది. ఆ కొత్తది సృష్టించడంలో హితైషులూ వంచకులూ ఒకే మాదిరిగా శ్రమించారు.

డేనియల్ వెబ్‌స్టర్ జాబెజ్‌స్టోన్‌ని చూపించాడు. స్టోన్ సర్వసాధారణవ్యక్తి. దురదృష్టం అతన్ని నిరంతరం పీడిస్తూండేది. అందునుంచి విముక్తి పొందాలనుకున్నాడు. ఆ దురదృష్టంనుంచి విముక్తి పొందినందుకు ఫలితంగా, అతను యింక కలకాలం కష్టపడవలసిందేనా? అతను ఏమంత చెడ్డవాడుకాదే - దైవభీతీ, సంఘనీతీ వున్నమనిషి. అతనిలో లోపాలు లేవనికాదు. మొండివాడు, పిసినిష్ఠి -

కాని మనిషి మట్టుకు అవును. మానవజన్మే దుఃఖాశ్రువులతో కూడినది; అంతమాత్రాన మానవజన్మలో గొప్పతనం లేదని అనుకోరాదు. మనిషి మనిషిగా బతకడమే నిజధర్మం. మానవజాతి ఆసంగతి మరువకూడదు.

డేనియల్ వెబ్‌స్టర్ ఫలానా మనిషికోసమని వాదించడం లేదు. మనుషులందరితరఫున, అతను వకాలతు పుచ్చుకు వాదిస్తున్నాడు. మానవజాతి జయాపజయములు అతను వర్ణిస్తున్నాడు. మానవుని ప్రయాణం అవధిలేనిది - కాని, అతనికి దారిపొడుగునా అవరోధాలే! ఈ ప్రయాణం ఎందుకో, దేనికోసమో - ఎవరూ చెప్పలేరు. ఏనాటికైనా చెప్పగలిగేది మానవుడొక్కడే.

నిప్పులకుంపటిలోని నిప్పు ఆరిపోతోంది. చల్లటి ప్రత్యూషపవనాలు వీస్తున్నాయి. డేనియల్ వెబ్‌స్టర్ తను చెప్పదలుచుకున్నది పూర్తిచేసేవేళకి, బూడిదరంగు వెల్తురు వచ్చింది. తనను పెంచినగడ్డ గురించి, వెబ్‌స్టర్ మాట్లాడిన మాటలతో న్యూ హాంప్‌షైరు యావత్తూ ప్రతిధ్వనించింది. మనిషన్నవాడు నేలని ప్రేమిస్తాడు. నేలనిపట్టుకు దేవుళ్లాడుతాడు. జ్యూరీ సభ్యులు ఏనాడో మర్చిపోయిన విషయాలు, వాళ్ళకళ్ళకి కట్టినట్టు ప్రదర్శించాడు డేనియల్ వెబ్‌స్టర్.

అతని కంఠధ్వని వారి చెవులమీదగాక హృదయాల మీద మోగింది. అదే అతనిలోని బలసంపద. డేనియల్

కంఠస్వరం జ్యూరీలో ఒకతనికి, కీకారణ్యంలోనుంచి కీచు మని వినిపించే శబ్దంలా ఉంది; మరొకతనికి సముద్రతరం గాలుపాడే సంగీతంలా ఉంది; ఇంకొకతనికి తన దేశమాత దీనాలాప మనిపించింది; వేరొకతనికి స్మృతిపథంలో అడు గునపడ్డ దృశ్యాల్ని జ్ఞప్తికి తెచ్చింది. ప్రతివాళ్లకీ ఏదో ఒకటి కనిపించింది; ఏదో ఒకటి గుర్తుకొచ్చింది. తను జాబెజ్ స్టోన్ని రక్షించగలిగాడో లేదో తెలియదుగాని, చెప్పదలుచుకున్నదంతా మట్టుకు చెప్పేశాననుకున్నాడు డేనియల్ వెబ్‌స్టర్. కాని, ఒక్కటిమాత్రం డేనియల్‌కి తెలుసు. జ్యూరీ కళ్లలోగానీ, జడ్జీ కళ్లలోగానీ వెనకటి తళుకు లేదు. అందరు మనుషులకి మల్లేనే ఉన్నారు వాళ్లూను. వాళ్లూ మనుషుల్లా అయారు.

పర్వతంలా నిలబడ్డ డేనియల్ వెబ్‌స్టర్, "యింక మీరు తీర్పు చెప్పాల్సివుంది," అన్నాడు జ్యూరీని ఉద్దేశిస్తూ.

వాల్టర్ బట్లర్, జ్యూరీతరఫున తీర్పు చెప్పేందుకు, తన స్థానంలో నిలబడ్డాడు. పరదేశివంక తీక్షణంగా చూస్తూ బట్లర్ అన్నాడు: "జాబెజ్ స్టోన్ దే సబబు. అతనిదే రైటు."

ఆ మాట వినేటప్పటికి, పరదేశి ముఖంలోని నవ్వు కాస్తా మాయమైంది. కాని వాల్టర్ బట్లర్ ఎంతమాత్రం వెనకాడకుండా యిలా అన్నాడు. "రాతకోతల ప్రకారం

రైటు కాకపోయినా, డేనియల్ వెబ్‌స్టర్ ప్రసరింపజేసిన కొత్తవెలుగుతో చూస్తే, జాబెజ్ స్టోన్ ది రైటు అనక తప్పదు.''

ఇంతలో కాకులుకూసే వేళ అయింది. లోకం తెల్ల బడ నారంభించింది. ఉప్పెన మాదిరి ఎలావచ్చారో, అలానే వెళ్లిపోయారు పన్నెండుగురు పెద్దమనుషులూ.

పరదేశి డేనియల్ వెబ్‌స్టర్ వంక వంకరచూపులు చూస్తున్నాడు. డేనియల్ అతని దగ్గరవున్న కాయితం పుచ్చుకు, నాలుగు ముక్కలుగా చించేశాడు. కాయితం చించడం అయిపోయాక, పరదేశి బుజంమీద చెయ్యివేసి, జబ్బ గట్టిగా పట్టుకున్నాడు.

"ఇదేమిటి! ఇదేమిటి!! నేను మీకు ఏమైనా, ఈ కేసుఖర్చులకిగాను డబ్బు యివ్వాల్సివుంటే, యిచ్చుకుంటాను చెప్పండి; అంతేగాని, ఈజబర్దస్తీ ఏమిటి?'' అన్నాడు పర దేశి.

"సరి – యివ్వకుండా నిన్ను వొదిలి పెడతా నను కున్నావా? ఆటేబుల్ దగ్గర కూచుని నువ్వు ఒక కాయితం రాసియివ్వాలి యిప్పుడు. జాబెజ్ స్టోన్‌నిగానీ, అతని వార సులనిగానీ, జ్ఞాతిసామంతాదులనిగానీ ఏనాడూ ఎటువంటి యిబ్బందీ పెట్టనని కాయితం రాసియివ్వాలి.''

పరదేశి ఆప్రకారమే కాయితం రాసియిచ్చాడు. అతను కాయితం రాస్తున్నంతసేపూ, అతని కోటు కాలరు తనచేతిలో పుచ్చుకునేవున్నాడు డేనియల్.

కాయితం రాయడం అయిపోయాక, "యింక నేను వెళ్లవచ్చునా?" అని అడిగాడు పరదేశి, విపరీతంగా భయపడుతూ.

మతలబు సరిగ్గావున్నదీ లేనిదీ చూసినమీదట డేనియల్ అన్నాడు. "వెళ్తావా? ఎక్కడికెళ్తావ్? మనిద్దరిమధ్యావున్న లావాదేవీలు యింకా పూర్తికానిదే ఎక్కడికెళ్తావ్? నిన్ను మార్ష్‌ఫీల్డ్ తీసుకుపోదా మనుకుంటున్నా. అక్కడ గోలియాత్ అను గొర్రెపొట్టేలు ఒకటి ఉందినాకు. దానికొమ్ములు ఎంతవాడి అయినవంటే, యినుప తలుపుల్ని కూడా చీల్చగలవు. నీమీదకి దాన్ని వుసిగొల్పి, ఆపైన ఏం జరుగుతుందో చూడాలనివుంది."

కాళ్లావేళ్లాపడి బతిమాలుకోవడం మొదలెట్టాడు పరదేశి. తనను రక్షించమని ప్రాధేయపడ్డాడు. మనిషిజానలా అయిపోవడంచూసి, డేనియల్ వెబ్‌స్టరే అతనిపట్ల దయ తలిచాడు.

"నేను మీచెయ్యిచూసి, మీకు జరగనున్న మంచి చెబుతాను," అన్నాడు పరదేశి డేనియల్ వెబ్‌స్టర్‌తో.

డేనియల్‌కి యిలాటి నమ్మకాలేమీలేవు. కాని

తమాషాకని చెయి చూపించుకున్నాడు. హస్తసాముద్రికం బాగా తెలిసినవాడల్లే వున్నాడు పరదేశి.

డేనియల్ చేతిలోని ఈగీతలూ ఆగీతలూచూసి, "మీకు ఆకాశాన్ని అంటే కోరికలు వున్నాయి," అన్నాడు.

"నిజమే!" అన్నాడు డేనియల్. అతనికి ప్రెసిడెంట్ అవాలని వుందనేది అందరికీ తెలిసిన విషయమే!

"కనుచూపుమేరలో కనిపిస్తుంది. అందినట్టే ఉంటుంది. కాని అది మీ చేతికి చిక్కదు. మీరు విస్మరింపబడతారు. మీకంటె తక్కువవాళ్లు ప్రెసిడెంట్ అవుతూంటారు."

"అయినా ఫరవాలేదు, నేను డేనియల్ వెబ్‌స్టర్‌గా మిగులుతానుగా! ఆతర్వాత?"

"మీకు యిద్దరు దృఢకాయులైన తనయులు. ఇద్దరికీ మీరు దారి ఏర్పరిచా ననుకుంటున్నారు. కాని ఇద్దరూ చెరొక యుద్ధంలో మరణిస్తారు. పేరు ప్రఖ్యాతులు పొందకుండానే మరణిస్తారు," అన్నాడు పరదేశి తలపంకిస్తూ.

"బతకనీ చావనీ – వారు నా కుమారులుకదా! వాళ్ల గురించిన దిగులు నాకేమీ లేదు. ఇంకొక్క ప్రశ్న : నాజీవితమంతా యూనియన్‌కోసం ధారపోశాను. ఈ యూనియన్

బయటి శత్రువులనీ, లోపలిశత్రువులనీ జయించి ఉక్కు-కోటలా అవడం నేను చూస్తానా?'' అని అడిగాడు డేనియల్ వెబ్‌స్టర్.

''అది మీరుచూడరు. కాని ఈ యూనియన్ ఉక్కు-కోటలా అవడం మట్టుకునిజం. మీతరవాత, కొన్ని వేలమంది మీ ఆదర్శంకోసం, హతులవుతారు. మీమాటలే వారికి ఆ ఉత్తేజాన్నీ శక్తినీ యిస్తాయి,'' అని చెప్పాడు పరదేశి.

''ఓ - యిలాంటిజోస్యం నాకు చెప్పకు. నాకాలితో తాపులు తినకపూర్వమే పారిపో,'' అని డేనియల్ వెబ్‌స్టర్ కాలు విదిలించేటప్పటికి, పరదేశి, పరుగో - పరుగు అంటూ పారిపోయాడు - తన అట్టపెట్టె ఒచ్చుకు.

ఆనాటినుంచి ఈనాటిదాకా, న్యూహాంప్‌షైర్‌లో దెయ్యాలు అగుపించడంలేదు అంటారు అక్కడివాళ్లు.

# పెద్దంతరం

## విల్లా కాథర్

## (1875 - 1947)

వర్జీనియా రాష్ట్రంలో జన్మించి, నెబ్రాస్కాలో పెరిగింది. నెబ్రాస్కా విశ్వవిద్యాలయంలో చదువుకు, పిట్స్‌బర్గులో కొన్నాళ్లు టీచరుచేసి, పత్రికాప్రపంచంలో ప్రవేశించేందుకు న్యూయార్కు వెళ్లింది.

సూటిగా, ఉన్నదున్నట్లు చెప్పడం, ఆమెరచనలోని ప్రత్యేకత. ఆమె నవలల్లో నెబ్రాస్కా వాతావరణం చాలా చక్కగా కనిపిస్తుంది. ఉత్తమ సాహితీపరురాలు - అనిపించుకుంది విల్లాకాథర్. "గోజికీ" (పెద్దంతరం) కథ 'అబ్‌స్కుర్యాన్ డెస్టినీస్' అను కథాసంపుటిలోనిది.

# పెద్దంతరం

గుండెకాయ సరిగ్గా లేదని డాక్టరు చెప్పేటప్పటికి గోజికీ వొప్పుకోలేదు - తను నమ్మనన్నాడు.

"కాస్త ఉబ్బసమన్న మాటేగాని, నాగుండెకేం, భేషుగ్గా ఉంది. నీరుడు వేసంగుల్లో కాబోలు, గడ్డివాము వేస్తున్నప్పుడు ఊపిరాడక, కొద్దిగా బాధపడ్డాను. అంతే గాని, నాగుండెకాయ కేం?" అన్నాడు గోజికీ.

"నాకంటె మీకు ఎక్కువ తెలిసినప్పుడు, మీరు నాదగ్గిరికి రావడమెందుకు చెప్పండి? గుండెకాయ సరిగ్గా వుండకపోవడం వల్లనే, ఆ ఊపిరాడకపోవడం. ఇప్పుడు మీ వయసు అరవై అయిదు. పడ్డన్నాళ్లు కష్టపడ్డారు. మీగుండె బాగా అలిసిపోయింది. అంచేత, ఇకనుంచి కొద్దిగా విశ్రాంతి తీసుకుంటూ బరువుపనులు మానెయ్యాలి. చేతికెదిగిన కొడుకులు అయిదుగురువున్నారు కదా!"

డాక్టరువంక కొద్దిపాటి ఆశ్చర్యంతో చూశాడు గోజికీ. కనురెప్పలు కళ్లని త్రికోణాకారంలో మూశాయి. అవిమందస్మితవీక్షణాలు. చూడటానికి గోజికీ జబ్బు మనిషిలా లేడు. అతను వయసులో పెద్దవాడయ్యాడన్న మాటే

గాని మొహం అంతగా ముడతలుకూడా పడలేదు. మీసకట్టు చెంపలకీ పెదిమలకీ రంగునిస్తోంది. జుట్టంతా యింకా నెరవనుకూడా నెరవలేదు. ఎత్తయిన నుదుటిమీద సమానాంతర రేఖల్లా గీతలు వున్నాయి. ఆసక్తి కనబరచడ మనేది అతని ముఖలక్షణం. తృప్తీ, ఆత్మసంతుష్టీ అతని మొహంమీద తాండవమాడుతూంటాయి. నిర్గుణమూర్తిలా కనిపిస్తాడు బయటివాళ్ళకి.

"గుండెకాయ సరిగ్గా లేకపోతే వేసుకునే మాత్రలు మీదగ్గిర లేవా?"

డాక్టరుకి చిరుకోపం వచ్చింది. "నేనయితే అంత అశ్రద్ధ చెయ్యను."

"అంటే ఏమిటి? ఇంక కాఫీ తాగవద్దంటారా?"

"మీ స్థితిలోవుంటే నేను అంత కాఫీతాగను. కాఫీ తాగొద్దనీ, చుట్ట కాల్చవద్దనీ చెప్పి ప్రయోజనంలేదు. అం చేత, అలాటివి చెప్పడంలేదు. పొలంపని తప్పనిసరిగా తగ్గించు కోవాలి. ఇంటిపట్టునవుంటూ గొడ్డూగోదా, చెట్టూచేమా చూసుకోవచ్చు. అంతేగాని, పొలాలవెంబడి పడిపోకూడదు," అని సలహా యిచ్చాడు డాక్టరు.

"ధాన్యం తొక్కించవచ్చా?"

"చెయ్యకూడదు."

నొసలు ముడివేస్తూ రోజికీ అడిగాడు: "ఇంకెప్పుడూ చెయ్యకూడదా?"

"అయిదారేళ్ళపాటు చెయ్యకూడదు. ఆపైమాట తర్వాత చూసుకుందాం. ఇంటినంటిపెట్టుకు మీా ఆవిడకి సాయంచేస్తూ వుండండి. మేరీలాటి భార్యే నాకువుంటే, నేను గడపదాటి వెళ్ళేవాణ్ణా!"

రోగి కొద్దిగా ఇకిలించాడు. "తిరక్క చెడతాడు మొగవాడు. వంటిల్లు పట్టుకు దేవుళ్ళాడుతూ నేనెక్కడ కూచోగలను? నిజానికి, మేరీయే నాకంటె ఎక్కువ కష్ట పడుతుంది."

"అంచేత, ఇంటిపట్టునవుంటే, ఆమెపని కొద్దిగా తేలిక అవుతుంది. మీావాళ్ళు ఎంతో మంచివాళ్ళు. అందరూ మిమ్మల్ని పువ్వుల్లోపెట్టి పూజిస్తారు. హాయిగా సుఖంగా కొన్నాళ్ళపాటు గడపండి."

"అవును, మా పిల్లాజెల్లా చాలా మంచివాళ్ళు," అని, డాక్టరు మాటలకి ఆమోదం తెలిపాడు రోజికీ.

డాక్టరు చీటీమీాద మందురాసియిచ్చి, మొన్న మధ్యనే పెళ్ళిఅయిన రుడోల్ఫు ఎలావున్నాడని అడిగాడు రోజికీని. రుడోల్ఫు వేరే కొంతపొలం కౌలుకి తీసుకున్నాడు. "పాలీ ఎలావుంది? అత్తాకోడళ్ళమధ్య పొరుపులు లేకుండా గడిచిపోతోందిగదా! పాలీ పట్నవాసపుపిల్ల అనుకుంటాను."

"పాలీ చాలా మంచిపిల్ల. మా ఆవిడకి కోడల్ని ఎలా చూసుకోవాలో బాగా తెలుసు. కోడలు కాస్త నాజూకైన అమ్మాయ్! అయినా, ఆమాత్రం నాజూకు లేకపోతే ఎలా ఈరోజుల్లో?" అంటూ రోజిక్ తలపంకించాడు. కోడలు గురించిన ప్రస్తావన వచ్చేటప్పటికి అతనికి ఎంతో సంతోష మయింది. ఆమె గురించి రెండు మంచిముక్కలు చెప్ప కుండా వుండలేకపోయాడు.

"గాలివాన వచ్చేటట్లు ఉంది. చినుకులు పడక పూర్వమే మీరు యిల్లుచేరుకోవడం మంచిది. కారులోనే వచ్చారుకదూ?" అంటూ డాక్టరు నిలబడ్డాడు.

"కారులోకాదు - బగ్గీలో. అయిదుగురు కొడు కులువున్నప్పుడు కారు నాకు వొదిలిపెడతారా?"

"మీరున్న చోటుకి వెళ్లేరోడ్డు మంచిదే అను కోండి. కాని, యింకెప్పుడూ మాత్రం యిలాటి గడ్డి బళ్ల మీద ప్రయాణం చేయకండి. జ్ఞాపకం ఉంచుకుంటారుగా!"

రోజిక్ డాక్టరుఫీజు టెలిఫోనుపక్కగా ఉంచాడు. పైకాన్ని అక్కడ జారవిడుస్తున్నట్టుగా, మరొకవంక చూస్తూ, టెలిఫోన్‌పక్కని వుంచాడుఫీజు. టోపీ నెత్తికి తగిలించుకు బయటికొచ్చాడు రోజిక్.

డాక్టరు సైతస్కోపుని కోపదృష్టులతో చూశాడు.

బాగా తెలిసినవాళ్ల గురించిన విషాదకరమైన నిజాలు చెబు తుందిగదా ఈ దిక్కుమాలిన స్టెతస్కోపు! మెడికల్ స్కూలుకి వెళ్లడానికి పూర్వం ఈ డాక్టరు ఒక బీద కుర్రవాడు. ఊహ తెలిసిననాటినుంచీ రోజికీ అతనికి తెలుసు; రోజికీ భార్య మేరీ ఎంతో మంచిఆవిడ.

నీరుడు చలికాలంలోనే రోజీకీ యింట్లో, ఒకఉదయం వేళ, తను బ్రేక్ఫాస్ట్ తీసుకున్నాడు. టామ్మార్షల్నుడి చాలా పెద్దఫారమ్; వారు ఎంతోభాగ్యవంతులు; పాడిపం టలకీ, నౌకర్లకీ, యంత్రసామగ్రికీ కొదవలేదు. కాని, అక్కడ ఆదరణ శూన్యం; మంచీ మర్యాదా తెలియదు అక్కడి వాళ్లకి. మిసెస్ మార్షలుకి చాలామంది పిల్లలుపుట్టారు; ఆవిడ కెప్పుడూ ఎడతెరిపిలేనంతపని. కానుపు కేసు అయింది; మొగపిల్లవాడు పుట్టాడు. తల్లినీ పిల్లనీ జాగ్రత్తగా చూస్తాం డమని దగ్గిరివాళ్లకి వొప్పజెప్పి, తెలతెల్లవారుతూండగా డాక్టరు బయలుదేరుతాడు. విపరీతంగా మంచుపడేరోజులు. కారు నడవదు అటువంటి మంచులో. అందుకని గుర్రబగ్గీ తీసుకొని, ఆ గుర్రబగ్గీలో ఎనిమిదిమైళ్లదూరాన వున్న రోజికీ ఫారమ్ దగ్గిరికివచ్చాడు. తనని ఆప్యాయంగా ఆహ్వా నించి, వెచ్చటికాఫీ యిచ్చే తెలిసిన కుటుంబం, ఆచుట్టుపట్ల అదొక్కటే!

డాక్టరు సరిగ్గా బ్రేక్ఫాస్ట్ వేళకి చేరుకున్నాడు.

మొగపిల్లలప్పుడే బ్రేక్‌ఫాస్ట్‌కని చేతులు కడుక్కుంటున్నారు. పొడుగుపాటి టేబులుమీద శుభ్రమైనగుడ్డ పరిచివుంది. వంటింట్లోనుంచి ఘుమఘుమలాడే పదార్థాలూ, కమ్మటి కాఫీవాసనా. అయిదుగురు అందమైనకుర్రాళ్లు - పన్నెండు యిరవై సంవత్సరాల మధ్యవయస్సు. అయిదుగురూ సద్వర్తనులని చెప్పుకోదగ్గవాళ్లే! తనకి మల్లే, చిన్నతనపురోజులు తలుచుకొని, బాధపడవలసిన భారంలేదువాళ్లకి. బగ్గీనుంచి గుర్రాన్ని విప్పేందుకు ఒకకుర్రాడు పరిగెత్తాడు, తన ఫర్ కోటువిప్పి కొక్కానికి తగిలించాడు మరొకకుర్రాడు ; అందరి లోకీ ఆఖరుదైన జోసఫిన్, అమ్మచెప్పిన ప్రకారం, టేబుల్ మీద మరొకరికి పళ్లెం అవీ అమర్చింది.

మేరీలాటి స్త్రీ సహజానురాగంతో ఆహారం పెడుతుంది. కోడి పిల్లలకీ, లేగదూడలకీ, మనుషులకీ కడుపు నిండా తిండి పెడుతున్నప్పుడు ఆమెకి ఎంతో ఆనందంగా ఉంటుంది. డాక్టరు ఒకవిధంగా తమవాడను కుంటుంది. ఇంకో గృహస్థు లెవరైనా ఐతే టేబుల్‌మీద గుడ్డమార్చి, మరొక మంచిగుడ్డవేసి, అతిథులకోసమని కేటాయించి ఉంచిన ప్లేట్లూ కప్పూసాసర్లూ బయటికి తీసేవారు. కాని మేరీ అలాటిది కాదు.

"మీరు వస్తున్నట్టు ముందు తెలిసివుంటే, మార్చే దాన్నే మోగాని యిప్పుడు మార్చను. మేము రోజూ

యెలాటి వాటిలో తింటామో, యివ్వాళా అలాటి వాటి లోనే పెడతాను.''

తను అలా చనువు తీసుకొని, బ్రేక్‌ఫాస్ట్ వేళ రావడం, మేరీకి సంతోష కారణమని డాక్టరుకి తెలుసు. రోజికీ ఏమీ మాట్లాడలేదు. తనను చిరునవ్వుతో ఆహ్వానించి, నిప్పుల కుంపటిలో మరికాసిని బొగ్గులు వేశాడు. అందరూ టేబులు ముందు కూచున్నాక, రోజికీ తనభార్యతో జెక్ భాషలో రెండు మాటలు మాట్లాడి, డాక్టరుతో యిలా అన్నాడు: ''మన బ్రేక్‌ఫాస్ట్ అయిపోయేదాకా మిసెస్ మార్షలు గురించిన ప్రశ్నలు వేయవద్దని మేరీకి చెబుతున్నాను. ప్రశ్నలు వేయడంలో మా ఆవిడది ఫస్ట్‌మార్కు.''

పిల్లలు చటుక్కున నవ్వారు; మేరీకూడా నవ్వింది. డాక్టరు బిస్కట్లూ అవీ తినేదాకా అతనివంక చూస్తూ, అతను తినడం అయ్యాక తను కాఫీ పుచ్చుకుంది. మేరీకి డాక్టరు చిన్నతనమంతా తెలుసు. అతను వృద్ధిలోకి వచ్చాడని లోలోన సంతోషించేది. తనకి హితులైనవాళ్ళు దగ్గిర వున్నప్పుడు మేరీకి యెంత సంతోషమో చెప్పలేం. డాక్టరుకి స్త్రీలగురించి తెలియదుగాని, మేరీకి తనంటే యెంతో ఆపేక్ష అని మట్టుకు తెలుసు.

కడుపులో చల్లబడ్డాక, డాక్టరు మిసెస్ మార్షలు గురించి చెప్పడం ప్రారంభించాడు. ఆసంగతులు వినడంలో పిల్లలు యెంతో ఆసక్తి కనబరిచారు.

"నేను క్రితంసారి అక్కడికి వెళ్ళినప్పుడు, ఆమె పాల బిందెలు మోస్తోంది. అలాంటి బరువుపనులు చెయ్యకూడదు," అన్నాడు రుడోల్ఫ. అప్పటికింకా అతను తండ్రిగారింట్లోనే ఉంటున్నాడు.

"ఆవేళ యింటికొచ్చి రుడోల్ఫ చెప్పాడునాకు. నేనంటే కండబలంగల మనిషిని కాబట్టి చేసినా యిబ్బంది లేదు. ఆమె అసలే సుస్త్రీమనిషి. అవునుగాని, రాత్రంతా అక్కడ కూచోబెట్టి, పొద్దుటే బ్రేక్‌ఫాస్ట్ పెట్టకుండా ఎలా పంపించారంటూ? మనుషులా పశువులా?" అంది మేరీ.

"డాక్టరు అక్కడ బ్రేక్‌ఫాస్ట్ తీసుకునివుంటే, మనింటికి వచ్చేవారుకాదుగా ఈ పూట!" అన్నాడు ఐదుగురు కొడుకుల్లో ఒకడు.

"డాక్టరు ఏవేళప్పుడు మనింటికివచ్చినా, మనకి సంతోషమే అనుకో - అది వేరేసంగతి. బ్రేక్‌ఫాస్ట్ పెట్టకుండా ఎలా పంపించగలిగారో నాకు ఆశ్చర్యంగా ఉంది," అంది మేరీ.

"వీళ్లు పుట్టేవేళకి నేను ప్రాక్టీస్ చేస్తూవుండివుంటే, ఎన్ని బ్రేక్‌ఫాస్ట్‌లు దొరికేవో కదా!" అని డాక్టరు పిల్లల్ని ఉద్దేశించి అనేటప్పటికి, పిల్లలందరూ గొల్లుమన్నారు.

మేరీ కాస్త సిగ్గుపడింది. కాని మాటకిమాట ఒప్పజెప్పడానికిమాత్రం వెనకాడలేదు. "బ్రేక్‌ఫాస్ట్ పుచ్చుకోకుండా

ఈ యింట్లోనుంచి వెళ్లనిచ్చేవాళ్లమా? ఏడాక్టరూ అలా వెళ్లలేదు. రోజికీ కంపటి అంటించేలోపున, నేనుచేసి పెట్టి వుండేదాన్ని,'' అందిమేరీ, భర్తని కలుపుకుంటూ.

పిల్లలు ఈసారి మరీబిగ్గరగా నవ్వుతూ, "నిజం - నిజం" అన్నారు.

"నాన్నా నాన్నా, - మీరు బ్రేక్‌ఫాస్ట్ పెట్టారా డాక్టరు గారికి మేము పుట్టినప్పుడు?"

"డాక్టరుగారికి పెట్టడమేకాదు - నాకుకూడా చేసి పెట్టేవారు. అప్పుడు నాకు తెగ ఆకలేసేది,'' అని, పొర పాటు సవరించుకుంటున్న దానిలా నవ్వుతూఅందిమేరీ.

గుర్రాన్ని తీసుకొచ్చి బగ్గీకి కట్టడానికిగాను కుర్రాళ్లు వెళ్ళగా, డాక్టరు కిటికీదగ్గిరికివెళ్ళి పూలమొక్కలని చూస్తూ నుంచున్నాడు. మీయింట్లో ఎర్ర మందారాలు అన్నివేళ ల్లోనూ పూస్తాయే! ఈరోడ్డమ్మట వెళ్తున్నప్పుడు మీ పూలగుత్తులవంక చూడకుండావెళ్ళను,'' అన్నాడు డాక్టరు.

మేరీ చటుక్కున ఒక ఎర్రమందారంతుంచి, డాక్టరు కోటుకి తగిలించింది. "దానిస్థానం అదీ. వయసు ముదిరి పోతోంది, డాక్టర్! యింకా పెళ్ళి చేసుకోవేం! నువ్వు తొందరగా పెళ్ళిచేసుకుంటే బావుణ్ను! ఇందాక బ్రేక్‌ఫాస్ట్ టేబుల్‌దగ్గిర, నీవంకే చూస్తూ కూచున్నా. నీజుట్టు అక్కడక్కడ తెల్లబడిపోతోందప్పుడే!''

"నిజమే - తెల్లవెంట్రుకలు వస్తున్నాయి. పెళ్ళి చేసుకునివుంటే, ఇంకా తొందరగా వచ్చేవేమో!"

"అలాటి మాటలంటే నేను వొప్పను. హోటల్ భోజనంతో ఆరోగ్యం పూర్తిగా చెడగొట్టుకుంటావ్! ఏదైనా కూరానారా పంపిద్దామన్నా, చేసినపదార్థాలు పంపిద్దామన్నా, నీకు ఆడదిక్కు వుంటేగదా పంపించేందుకు! వయసులో వున్నవాళ్ళ జుట్టు నెరిసిపోవడంచూస్తే, నాకు బావుండదు. ఆమాటకొస్తే నెరవడమే నాకుబావుండదు," అంది మేరీ.

తోటివారు మేడలూ మిద్దెలూ కడితే, రోజికీ ఎప్పటి లాగానే వున్నాడని లోకులనుకుంటారు. నిజమేమరి! అతను వొళ్ళువంచి పనిచేస్తాడు. అతని కొడుకులుకూడా అంతే! అదృష్టం కొట్టుకురావాలని వెర్రి ఆశలకిపోరు. అనవసరంగా అప్పులుచెయ్యరు. ఉన్నదానితో సరిపెట్టుకుంటారు. రోజికీ కుటుంబంలాటి మంచివాళ్లూ గుణవంతులూ ముందుకి దూసుకు పోవడం అరుదు; వారు చెంగుచెంగున పరువులెత్తరు. జీవిత స్వారస్యాన్ని అనుభవించనైనా అనుభవించగలం, లేదా బాంకులోనైనా పదిలపర్చగలం - అంతేగాని రెండూ చెయ్య లేం, ఏదోఒకటే!

# 2

రోజీకీ డాక్టరుగారి ఆఫీసుదగ్గిరనుంచి వ్యవసాయపు పనిముట్లు అమ్మేషాపుకివెళ్లి, చుట్టవెలిగించి, కళ్లజోడు తగిలించుకుని, మేరీయిచ్చిన లిస్టువంక ఒక్కసారి చూశాడు. అక్కడనుంచి పక్కకొట్లోకి వెళ్లాడు. ఆపక్కకొట్లో, కనుబొమలు కత్తిరించుకున్న అమ్మాయి ఒకతె ఉంటుంది. ఆ అమ్మాయి కనుబొమలు కత్తిరించుకోవడం మహా అందంగా కత్తిరించుకుంటుంది. రోజీకీకి ఆషాప్ అమ్మాయితో మాట్లాడటం సరదా.

"ప్రతి పదిహేనురోజుల కొకసారి మీరు దిండుగలీబులకి గుడ్డ కొంటూవుంటారేమిటి? మీ ఇంట్లో చాలా దిళ్ళు వున్నట్టున్నాయే!" అంది ఆ అమ్మాయి.

"ఇది మా కోడలికి - పాలీకి. మా రుడాల్ఫ్‌ని పెళ్ళి చేసుకుందే - ఆ పాలీకి."

షాపు అమ్మాయితో కాసేపు సరదాగా మాట్లాడి రోజీకీ బయటికొచ్చాడు. బయట మంచు పడుతోంది. మంచు పడటానికి అదే మొదటిరోజు. మొదటిరోజు పడే మంచు చూడటం ఎంతో సంతోషప్రదం. పెద్ద బజారమ్మట బగ్గీ తోలుకుంటూ, పట్నం వీధులుదాటి, ఊరు బయటికి

వచ్చాడు. చుట్టూతా శ్రేష్టమైన పొలాలు. ఆ పొలాలుచూసి ఆనందిస్తూ ఎనిమిదిమైళ్లు వచ్చాడు.

తనపొలం శివార్లని అంటిపెట్టుకు వుంది గ్రేవ్ యార్డ్ (సమాధిస్థలం). బగ్గీని ఒకసారి అక్కడఆపి, బగ్గీలోకూంచునే, మంచుకురవడం విస్మయానందంతో చూస్తున్నాడు. ఆ మంచు తెరలమధ్య తమ యిల్లు కనిపిస్తోంది. గాలిమరకీ, పర్వతలోయకీ మధ్యగావున్న దే తమయిల్లు. ధాన్యపు పొలాలూ పచ్చికబీళ్ళూ మంచుకోటు తొడుక్కుంటున్నాయి. గాలి పల్చగా వీస్తోంది – మరీ యెక్కువగాలేదు. మంచు టోపీలు పెట్టుకున్న చెట్లూరాళ్లూ వింత అందం వెదజల్లుతున్నాయి.

ఈ స్మశానం సువిశాలమైనది; స్వగృహం లాగానే వుంది, విచార సూచకమైన చిహ్నలేమీ లేవిక్కడ – అనుకున్నాడు రోజికీ. హాయిగా ఆ పసరిక మీాద పడుకొని నీలాకాశాన్ని చూడవచ్చు; దారినపోయే గుఱ్ఱబగ్గీలశబ్దం వినవచ్చు; పంటలకాలమయితే, యింట్లో వున్నట్టే వుంటుంది. నిజానికి, యింటికి చాలా దగ్గరగా వుంది. తనకప్పుడే చనిపోవాలనిలేదు. తనకి ఈ నేలఅంటే చాలాయిష్టం; ఇది వొదిలిపెట్టాలనిలేదు. తమ పొలాన్ని అంటిపెట్టుకునేవుంది స్మశానం. తమ పొలంలోని ధాన్యపు గరిసెలమీాద, యిక్కడ ఈ సమాధిస్థలంమీాద పడే మంచు,

అంటే అక్కడా యిక్కడా పడేమంచు, ఒకేమంచు. గ్రేవ్ యార్డ్‌లో వున్నవాళ్లు మట్టుకు కొత్తవాళ్ళా? అందరూ తన వెనకటి మిత్రులే! ప్రతిదీ అర్థం చేసుకోవాలేగాని ఖంగారు పడటంవల్ల ప్రయోజనమేముంది? ఖంగారుపడటం రోజికీ స్వభావలక్షణం కాదు.

మంచుపడుతోంది. చక్కగా పడుతోంది. మంచు పడటమనేది చూసి ఆనందించాలి - అనుభవించాలి. తన టోపీమీద, భుజాలమీద, గుర్రాలజూలు మీద, ఆ గుర్రాల వీపులమీద - అంతా మంచే! గాలికి ఒక నూతన పరిమళమొచ్చింది. ఆ పరిమళమిచ్చే సందేశ మేమిటంటే సమస్త జీవకోటినీ కొన్నాళ్ళపాటు విశ్రాంతి తీసుకోమని. మనుషులకి, జంతువులకి, చెట్లకి, నేలకి - సమస్తానికీ కొన్నాళ్ళపాటు విశ్రాంతి. దీర్ఘమైన రాత్రులూ, నిప్పుల కుంపటిదగ్గిర కాలక్షేపం, ఆదరాబాదరాలేని కార్యక్రమం - అదీ హేమంతకాల శాసనం. రోజికీ మనసు వడివడిగా పరుగెడుతోంది; గుర్రాలని ఒక్కదూకు దూకించాడు.

రోజికీ ఇల్లు చేరుకునేటప్పటికి ఆఖరబ్బాయి జాన్ ఆటలాడుకునేందుకు వెళ్తున్నాడు; వాళ్ళో ముల్లంగిదుంపలు పోసుకు మేరీ ఎదురయింది. ఇద్దరూకలిసి యింట్లోకి వెళ్లారు. భోజనాల టేబుల్‌మీద నల్లద్రాక్ష గుత్తులు కనిపించాయి రోజికీకి; వంటగదిలోనుంచి కమ్మటికాఫీ వాసనవస్తోంది.

రోజికీ ఎప్పుడూ పట్నంలో భోంచెయ్యడు. డబ్బుదండుగ — అంటాడు. అదీగాక, అక్కడి ఆహారపదార్థాలు అతనికి నచ్చవు. అంచేత, అతను పట్నం నుంచి యింటికి వచ్చే వేళకి, కమ్మటిభోజనం సిద్ధంచేసి వుంచుతుంది మేరీ.

భోజనపదార్థాలు చుట్టూతా పెట్టి, అతనికి ఎదురుగా కూచుంది మేరీ.

కాసేపయాక భర్తని మాటల్లోకి దింపింది.

"డాక్టరు ఏమన్నాడు?"

"నీకు అభివందనాలందజేయమని ఏమిటో ఏమిటో చెప్పాడు. అదంతా మర్చిపోయాను," అన్నాడు రోజికీ నవ్వుతూ.

"నామాటకేంగాని, మీగురించి ఏమన్నాడు? మీ ఉబ్బసం గురించి?"

"నాకు ఉబ్బసం లేదన్నాడు" అన్నాడు రోజికీ నవ్వేస్తూ.

"అసలు విషయమేమిటో చెప్పండి. అలా మాట తప్పిస్తే, వూరుకునేదాన్ని కాదు."

"ఏమీలేదట. నేను కాస్తపెద్దవాణ్ణి అయానట. అంచేత, గుండెకాయ సరిగ్గావుండటం లేదట."

మొహంమీద పడుతున్న వెంట్రుకలు, రెండు చేతు

లతోనూ చెవులమీదికి తీసుకు, భర్తవంక తీక్షణంగా చూసింది మేరీ. అది కోపానలదృష్టి.

"గుండెజబ్బు ఏమీ లేదని డాక్టరు ఖచ్చితంగా చెప్పాడా?" అని బిగ్గరగా ఆందోళనతో అడిగింది మేరీ.

"ఎందుకలా కొంప మునిగిపోయినట్టు అరుస్తావ్? స్త్రీ అన్నది మృదువుగా మాట్లాడితేగాని నాకు బావుండదని నీకు తెలుసు. నాకు గుండెజబ్బు వుందని అతను అనలేదు. వచ్చేవయసా పోయేవయసా, - అంచేత మునుపటికిమల్లే బరువుపనులు చెయ్యకు - అన్నాడు."

మేరీకి ఒక్కసారి గెంతాలనిపించింది - కాని కదలక మెదలక కూచుంది. "ఎటువంటి పరిస్థితిలోకూడా రోజికీ మాట కటువుగా వినిపించదు; బిగ్గరగా తనకిమల్లే అరవడు"- అనుకుంది మేరీ. అతను పట్నవాసంలో పెరిగినవాడు; తను పల్లెటూరిది. అబ్బాయిలుకూడా తండ్రిపోలికనే ఉండాలనుకుంటుంది మేరీ.

"మీకక్కడ నొప్పీగిప్పీ లేదు కదా! కడుపునొప్పీ, ఊపిరిబాధా - ఈ రెండేగా? మన డాక్టరు ఫరవాలేదని చెబితే, యింక నాకు నిశ్చింతే. అయినా, నేనుకూడా ఒకసారి పట్నంవెళ్ళి, అతన్ని కనుక్కువస్తాను. మందేమీ రాసివ్వలేదూ?"

"చలికాలంలో బయటికి వెళ్ళొద్దనీ, యింట్లో కూచోమనీ అన్నాడు. ఇంట్లో చూసుకోవలసిన వడ్రంగి పని వుందికదా! పిల్లలు పుస్తకాల అల్మారాలు లేక బాధ పడుతున్నారు; మరొక చిన్న స్నానాలగది ఆ మూల కట్టాలి. చాలా వున్నాయి," అన్నాడు రోజికీ.

భోజనానంతరం తాగేకాఫీ తాగుతూ, తను చేయ వలసిన పనులగురించి ఆలోచించసాగాడు రోజికీ. మీసాలకి తగిలిన కాఫీని తన నీలం జేబురుమాలుతో తుడుచుకు, ఒకటో రెండో గుక్కలుతాగి, కప్పు కిందపెట్టి, నీలం రుమాలుతో మీసాలు తుడుచుకు, మళ్ళీ ఒకటో రెండో గుక్కలుతాగి, కప్పుకిందపెట్టి, నీలం రుమాలుతో మీసాలు తుడుచుకు – ఈ మాదిరిగా కాఫీతాగడం పూర్తిచేశాడు.

కాఫీ తాగుతున్నంత సేపూ మేరీ అతన్ని పరీక్షగా చూస్తోంది. ఇద్దరం ఒకటే అనుకున్నవాళ్లు ఒకరినొకరు వేరుగా చూడగలగడం కష్టం. అవును, అతని జుట్టు మును పటికంటె పల్చనయింది. నుదుటిమీద ముడతలులేవుగాని గీతలు వున్నాయి. చెంపలుకూడా జారినట్టులేదు. ఆ చెంప లకి ఒక తళుకువుంది. స్వతహాగా శాంతస్వభావుడవడం వల్లనేమో, అతనిమొహం ఎక్కడా వాడినట్టుకూడా లేదు. పెళ్ళినాటి కతను పొట్టిగా లావుగా వుండేవాడు. ఇప్పుడూ వీపూ భుజాలూ పుష్టిగానే ఉన్నాయి; కాళ్ళే కాస్తకురచ.

మేరీకంటె అతను పదిహేనేళ్ళు పెద్ద. కాని ఆ తలంపే రాలేదు మేరీకి ఏనాడూ. అతను తనమనిషి - తను కోరినమనిషి, తనకి నచ్చినమనిషి. తను పల్లెటూరిది, మొరటుది. అతను పట్నవాసంలో పెరిగినవాడు, నాజూకులు తెలిసినవాడు. జడివానలకీ, తుపానులకీ జంకక సముద్రప్రయాణంచేసిన నావికులు తామిద్దరూ. జీవితం గురించి యిద్దరికీ ఒకేమాదిరి అభిప్రాయాలు ఉండటంవల్ల బ్రతుకుబాట సుగమమయింది. ఏవి మొట్టమొదటవస్తాయి, ఏవి తర్వాత వస్తాయి - అనే విషయంలో తర్జనభర్జనల నిమిత్తంలేకుండా ఏకీభవించేవారు. మాతృభాష అయిన జెక్‌లోకూడా ఎప్పుడూ వాదించుకునేవారుకాదు. రెండు మాటల్లేవు - యిద్దరిదీ ఒకేమాట; ఒకే ఆలోచన, ఒకే మార్గం.

భూమాతని నమ్ముకున్న ఇటువంటి పేదకుటుంబీకులు ఎన్నో కష్టనష్టాలకి గురికాకతప్పదు. కష్టాలూ వున్నాయి, సుఖాలూ వున్నాయి. ముళ్లూఉన్నాయి, పూలూఉన్నాయి. కాఠిన్యమనేది ఎక్కడాలేదు రోజికీలో. అతి సౌమ్యుడు. పల్లెటూరిపిల్లని పెళ్ళిచేసుకు, ఆమెని సౌమ్యమార్గానికి తిప్పుకున్నాడు.

ఉరుకులూ పరుగులూ వారి జీవన గమనంలో లేవు. దమ్మిడి దమ్మిడి చొప్పున మిగల్చాలనే తాపత్రయం అంత

కంటె లేదు. పొరుగువాళ్లు ఎక్కువ పొలాలూ, ఎక్కువ పశువులూ కొనుక్కుంటున్నారనే చింత వాళ్ళకి ఎంతమాత్రం లేదు. పచ్చిపాలలోనుంచి తీసిన వెన్నని పట్నం తీసుకెళ్ళి అమ్మే క్రీమరీ ఏజంటు ఒకసారి మేరీదగ్గిరికివచ్చి, ఫలానా ఫాసలర్స్ గడచినఏడు పచ్చిపాలలోని వెన్న అమ్మడంవల్ల ఎంత సంపాయించినదీ చెప్పాడు.

"బాగానేఉంది. ఫాసలర్ వాళ్ళ పిల్లలనిచూడు, మా పిల్లలనిచూడు. చప్పి దవడలతో జిడ్డువోడుతూ ఉంటు న్నారు వాళ్ళు. బాంకులో డబ్బేసుకోవడంకంటె, పిల్లల మొహాలు తళతళలాడేటట్టు చూడటం ముఖ్యం," అంది మేరీ.

క్రీమరీ ఏజంటు రోజికీ నైపుచూశాడు.

"మా ఆవిడ చెప్పింది నిజమేగా!" అన్నాడు రోజికీ.

# 3

మేరీ పట్నంవెళ్ళి డాక్టరుతో మాట్లాడి వచ్చింది. తండ్రి విషయమై ఒకకంట కనిపెట్టమని పిల్లలకి చెప్పింది. ఆఖరు కుర్రాడైన జాన్ ఎప్పుడూ తండ్రిని అంటిపెట్టుకు వుండేవాడు. రోజికీ ఏపనిచేస్తున్నా, తండ్రికి సాయం చేయ

డానికిగాను, ఎవరో ఒకరు [illegible] తనకి పెద్ద తనం వచ్చినమాట నిజమేగాని, నాయనమ్మకింద జమకడితే వొప్పుకోనని అనేవాడు రోజికీ.

ఆ చలికాలమంతా రోజికీ యింటిపట్టునే వుండి, వడ్రంగమో మరొకటో చేస్తూ కూచునేవాడు. లేదా కిటికీకి దగ్గిరసావున్న కుర్చీలోకూర్చొని పూలమొక్కలు చూస్తుండే వాడు. రోజికీ కూచునేచోటుని 'ఫాదర్స్ కార్నర్' అనే వారు. అక్కడొక చిన్న పుస్తకాలబీరువా ఉండేది. అందులో అతని పాతకాలపు కాయితాలు ఉండేవి; చిన్న ప్పుడు దర్జీపని చేసేవాడు కాబట్టి, సూదీ దారం మొద లైనవికూడా అందులో జాగ్రత్తచేశాడు. తను చిన్నప్పుడు నేర్చుకున్న కుట్టుపనిని వృథాకానిచ్చేవాడు కాదు రోజికీ. పిల్లల బట్టలుగానీ, తన బట్టలుగానీ ఎక్కడ తూటుపడ్డా, సూదీ దారం పుచ్చుకు కుట్టేవాడు. దర్జీపని అంటే అతనికి మహా సరదా. పెద్దపిల్లల పంట్లాములు వాళ్ళకి పట్టకపోతే, చిన్నవాళ్ళకి సరిపడేట్టుగా కత్తిరించి, కుడుతూండేవాడు.

చేతులు ఒకపక్క కుడుతూండగా, మనసు జ్ఞాపకా లని నెమరు వేస్తూండేది. ఎన్నెన్నో జ్ఞాపకం వచ్చేవి; జ్ఞాపకం పెట్టుకోవలసినది ఎంతయినా ఉంది. మూడు దేశా లలో మూడురకాలుగా తన జీవితం గడిచింది. లండన్‌లో గడిపిన ఆ రెండేళ్ళే తనకి జ్ఞాపకం తెచ్చుకోవడం యిష్ట

ముండదు. ఒక జర్మన్ టైలర్ (దర్జీ) దగ్గిర పనిచేసే వాడప్పుడు. ఆ జర్మన్ ఎంతో బీదరికంలో ఉండేవాడు. తన పరిస్థితి మరీఅధ్వాన్నం. ఆరోజుల్లో తను ఎప్పుడూ ఆకలితో అలమటిస్తూనే ఉండేవాడు. పైగా, అది తనకి భాష తెలియని ప్రదేశం.

న్యూయార్కు వచ్చేవేళకి అతని వయస్సు సరిగ్గా యిరవై. వాషింగ్టన్ మార్కెట్‌కి దిగువని, విసిస్ట్రిక్టులో ఉన్న ఒక దర్జీషాపులో పనికి కుదిరాడు. అవిఅతనికి మంచి రోజులు. నడుం వొంచి పనిచేసేవాడు; కష్టానికితగ్గ ఫలితం కనిపిస్తూండేది. కొన్నాళ్ళకి జీతం పెరిగింది. తన పనేదో తను చూసుకునేవాడు; తనకి ఉన్నదానితో సంతోషపడే వాడు; ఇతరులకి వచ్చిపోతుందే అను ఏడుపుగొట్టు స్వభావం కాదు తనది. నైట్ స్కూలుకివెళ్ళి ఇంగ్లీషు చదవడం నేర్చుకున్నాడు. నాలుగుడబ్బులు గిడతాయి గదా అని "వోవర్‌టైము" చేస్తూండేవాడు. అలాగే, నాలుగు డబ్బులు గిడుతూండేవికూడాను. ఎవరైనా స్నేహితుడు అప్పుకి చెయ్యిజాస్తే లేదనేవాడు కాదు; కష్టపడి సంపాయించి నది హాయిగా ఖర్చుపెట్టుకునేవాడు. చుట్టలకి, అమ్మాయిలకి, నాటకాలకి మహాఖుషీగా తగలేసేవాడు. దమ్మిడీ మిగిల్చే వాడుకాదు. ఈ శనివారం చూసిన నాటకం మళ్ళా శని వారం వచ్చేదాకా మనసులో మెదులుతూండేది. న్యూ

యార్క్ మహానగరానికి అవి సంగీత నాటకాలరోజులు. నంచుని నాటకం చూసేందుకు టిక్కెట్టుఖరీదు ఒకడాలరు ఉండేది. డాలరయితే మాత్రమేం? ఆ దృశ్యాలూ, ఆ దీపాలూ, ఆ సుందరాంగులూ, ఆ గానమాధుర్యం - ఏమయితేనేం, వారంరోజులకి సరిపడ్డంత మానసికానందం. ఒక్కడూ వెళ్లేవాడుకాదు - ఎవరో ఒకస్నేహితుడు వెంట నుండాల్సిందే! నాటకం అయిపోయాక, దగ్గిర్లోవున్న 'బార్'కి వెళ్లి యిద్దరూ బీరుతాగేవారు. ఆరోజులేవేరు. జీవితం మహాఖులాసాగా గడిచేది. అయిదేళ్లపాటు కాబోలు, చీకూచింతాలేకుండా, ఆప్రకారం గడిచింది, చుట్టూవున్నలోకం నిత్యనూతనత్వంతో తనని పలకరించేది. మురికి, ఆకలి, చలి - యిలాటివి తను ఎరుగునా? న్యూయార్కంత మంచి పట్నం ఎక్కడా లేదనుకున్నాడు. అందానికి అందం, డబ్బుకి డబ్బు, స్నేహానికి స్నేహం - ఈమూడూ కుప్పతిప్పలుగా దొరుకుతాయి ఈ మహానగరంలో.

రోజికీ పనిచేస్తున్న దర్జీషాపుకి దగ్గిర్లోనే, లోఫ్లెర్ అను ఆస్ట్రేలియా దేశస్తుని ఫర్నిచర్ షాపుఒకటిఉంది. ఆ ఫర్నిచర్ షాపులో జిచెక్ అను ఒక జెక్ పనిచేస్తూండేవాడు. రోజికీ, అతనికీ స్నేహం కుదిరింది. కలపవర్తకుడైన లోఫ్లెర్ తనమేడ పైభాగంలో ఒకచిన్నవాటా ఈ యిద్దరు జెక్‌లకీ యిచ్చాడు. జిచెక్ చెయితిరిగిన వడ్రంగి, బీరు

ఖాలూ బల్లలూ చేయడం అతనికి బాగా తెలుసు. తమకున్న చిన్న వాటాలో వాళ్లిద్దరూ రకరకాల హంగులు తయారు చేసుకునేవారు. రాత్రివేళా, ఆదివారాలప్పుడూ - అంటే కలపయంత్రాల రణగొణధ్వని వినిపించని సమయాల్లో - వారి వాటా మహాప్రశాంతంగా ఉండేది. వేసవిరాత్రులలో సముద్రపుగాలి చల్లగా పలకరిస్తూండేది. జిచెక్ సాయంత్రంవేళ ఫ్లూట్ వాయించేవాడు. ఇద్దరికీ సంగీతమంటే యిష్టమే! యిద్దరూకలిసి సంగీతనాటకాలకి వెళ్తూండేవారు. బతికున్నన్నాళ్లూ ఆరకంగా బతకవచ్చు ననుకున్నాడు రోజికీ.

కాని, పరస్పర ప్రతిధ్వనుల్లాంటి ఏళ్లు గడిచినకొద్దీ అతనిలో అశాంతి తీవ్రం కాజొచ్చింది. వసంతకాలం వచ్చే టప్పటికి, గొంతుక ఎండిపోయినట్టయి, చెడతాగేవాడు. ముఖ్యంగా శనివారంరాత్రి మరీ ఎక్కువ తాగేవాడు. ఆదివారమంతా మందకొడిగా బరువుగా ఉండేది. మళ్ళీ సోమవారంనుంచి మామూలు పని. ఏదో తనని బాధిస్తోందని తెలుసుగాని, అదేమిటో తెలుసుకునేపాటి వ్యవధి ఉండేది కాదు. పచ్చగడ్డి మొలిచి కొత్తపువ్వులు పూసేకాలంలో, అతనికి ఎక్కడికో పారిపోవాలనిపించేది. అందుకని, ఎక్కువగా తాగి, మాయ - స్వేచ్ఛలో మైమరిచేవాడు.

రోజికీకి, వృద్ధుడైన రోజికీకి, అవన్నీ నిన్న జరిగి నట్టున్నాయి. జులై నాలుగవ తేదీ మధ్యాహ్నం; పార్కు

ప్లేస్‌లో తను కూచున్నాడు. న్యూయార్క్ దిగువ భాగ మంతా ఖాళీ. వాల్‌స్ట్రీట్, లిబర్టీస్ట్రీట్, బ్రాడ్వే - అంతా ఖాళీ. ఆ రోడ్లమీద జనసంచారంలేదు; ఇళ్ళన్నీ బోసిగా ఉన్నాయి. అదేదో విపరీతమైన శూన్యత్వం. పెద్ద ఫాక్టరీ లోని యంత్రాలన్నీ పనిచెయ్యడం ఆగిపోతే ఎంత వెలితిగా ఉంటుందో, అలావుంది ఆ శూన్యత. జీవచైతన్యంలేని ఆ విశాలభవంతులు కాళీ అయిపోయిన జైళ్ళలా ఉన్నాయి. మహాపట్నాలలోవున్న యిబ్బందే యిది - అనుకున్నాడు రోజికీ. భూమినుంచి అవి మొలుస్తాయి; కాని భూమికీ మనకీ మధ్య సిమెంటుని అడ్డం ఉంచుతాయి. భూమికి దూరమైపోతాం మనం. మనదొక అస్వాభావిక ప్రపంచం - మత్స్యశాలలోని చేపలకిమల్లే; యక్వేరియమ్ (మత్స్యశాల) లోని చేపలు సముద్రంలోని చేపలకంటె హాయిగా లేవా అని అంటారేమో - అది వేరేసంగతి.

ఆరోజునుంచి గట్టిగా ఆలోచించడం మొదలెట్టాడు రోజికీ. పశ్చిమాన జెక్ వ్యవసాయదారులు కొందరు, వ్యవ సాయక్షేత్రాలు ఏర్పరుచుకున్నారని, పత్రికల్లో చదివాడు. తనకి తను భూమి కొనుక్కోగలనని అతను ఎంతమాత్రం అనుకోలేదు. వ్యవసాయరంగంలోకి ప్రవేశిద్దామనీ, ఎవరో ఒకరిదగ్గిర పనికి కుదురుదామనీ అనుకున్నాడు. తన తండ్రి వైపువాళ్లు షాపుల్లో పనిచేసినవాళ్లుగాని, పొలాలమీద పని

చేసినవాళ్లు కాదు - కార్మికులు వాళ్లు; కర్షకులు కాదు. తన తల్లివైపువాళ్లు, కొంతపొలాన్ని కౌలుకి తీసుకు, వ్యవసాయ నిర్వహణలో సతమతమయారు. ఇటు తల్లివైపువాళ్లు గానీ, అటు తండ్రివైపు వాళ్లుగానీ ఏనాడూ భూవసతి అనుభవించిన బాపతు కాదు. అంత స్తోమతు కలవాళ్లు కానే కాదు. రోజికీ తల్లి అతను చాలా చిన్నవాడుగా ఉన్నప్పుడే చనిపోయింది. తల్లి మరణానంతరం తాతముత్తవలు అతన్ని తీసుకెళ్ళి, తమదగ్గిరవుంచుకు పెంచారు. పన్నెండేళ్ళు వచ్చేదాకా వాళ్ళదగ్గిర పెరిగాడు. భూమాతమీద అతనికి కలిగిన మమకారం ఆ చిన్ననాటి రోజుల్లోదే! తాత చనిపోయాక, తండ్రిదగ్గిరికి వచ్చాడు. సవతితల్లి అతన్ని చాలా బాధలు పెట్టేది. ఆబాధలు తనకళ్ళతో చూడలేక, కుర్రవాణ్ణి నెమ్మదిగా లండన్ పంపించాడు రోజికీ తండ్రి.

పార్క్‌ప్లేస్‌లో జులై నాలుగవ తేదీన కలిగిన అనుభూతితో, రోజికీకి ఎలాగో అలా గ్రామీణప్రాంతాలకి రావాలని గట్టిగా పట్టుకుంది. ఎవరో ఒకరి పొలంలో కూలి డబ్బులకి పనిచేదామనుకున్నాడు. సూర్యోదయ సూర్యాస్తమయాలు చూడగలగడం, తనునాటిన గింజలు ఏపుగా మొక్కలై పెరగడం - ఈరెండే అతనికి కావలసింది. రోజికీ నిరాడంబరజీవి. ఎన్నో వేళ్లుగల మహావృక్షంలాటి మనిషి కాదతను; అడుక్కి చొచ్చుకుపోగల తల్లివేరు ఒకటే వున్న మొక్కలాటివాడు.

అతనిమనసు పశ్చిమదిశ వైపుకే పరువులెత్తుతోంది. స్వాతంత్ర్యం సంపాయించుకునేందుకు కొద్దికొద్దిగా డబ్బునిలవ చేయడం మొదలెట్టాడు. న్యూయార్కు మహానగరానికి వీడ్కోలు చెప్పేనాటికి అతని వయసు ముప్ఫయ్యయిదు. దర్జీషాపులోని ఉద్యోగానికి నీళ్లువొదిలి, తన అదృష్టాన్ని వెతుక్కుంటూ పశ్చిమానికి ప్రయాణమయాడు.

# 4

ఇంచుమించు యౌవనదశంతా గడిచిపోయాక పెళ్లి చేసుకుని వుండటంవల్లనే కావచ్చు - రోజికీకి తన పిల్లలంటే అంత ఆపేక్ష. వారిని తండ్రివలె శాసించక, తాతమాదిరి వారితో చనువుగా ఉంటాడు. పిల్లలగురించి అతనికేమీ దిగులులేదు - ఒక్కరుడోల్ఫ గురించే ఈమధ్య.

ప్రతిశనివారం సాయింత్రం పిల్లలందరూ, జోసఫిన్‌ని కూడా వెంటబెట్టుకు, పక్కపట్నంలోని సినీమా చూడటానికి వెళ్తారు. శనివారం ఉదయం భోజనాలబల్లదగ్గర, తమ సాయింత్రపు ప్రయాణంగురించి మాట్లాడుకుంటున్నారు. ప్రతిసారీకంటె, ఒకగంట ముందుగా బయలుదేరి, బజారు పనులుకూడా చూసుకువద్దామనుకున్నారు.

రోజికీ పిల్లలవంకచూసి అన్నాడు: "ఈరాత్రికి

కారు నాకు కావాలి. వీలుగావుంటే, పొరుగువాళ్ల కార్లలో మీలో కొందరు వెళ్లండి. కారు నాకు కావాలన్నానని నిరుత్సాహపడకండేం!''

నిరుత్సాహపడకుండా వుండగలరా చిన్నవాళ్లు? వారమంతా వాళ్లు హూనం హూనం అయేటట్లు పనిచేసి వుంటారాయె. ఆ ఒక్కరోజున లభ్యమయ్యే ఆనందవినోదాలకోసమే ఎదురు చూస్తూంటారువాళ్లు.

"అమ్మా నువ్వూ కలిసి పట్నం వెళ్తూంటే, మాలో యిద్దరిని పట్టుకుపోవచ్చుగా మనకారులో?'' అన్నాడు ఫ్రాంక్.

"మేము వెళ్లడంలేదు. కారుని రుడోల్ఫ్‌కి తీసుకు వెళ్లి యిద్దామనుకుంటున్నాను. పాలీ, అతనూ సినిమా చూడటానికి వెళ్తారు. పాలీ కూడా మన అమ్మాయే కదా! పట్నవాసం నుంచివచ్చిన అమ్మాయి, మనమిక్కడ ఏదో ఏకాంతవాసంలో ఉంచుతున్నామన్నట్టుగా భావించకూడదు. రుడోల్ఫ్‌కి యింకా కారు కొనుక్కునేపాటి డబ్బు సమకూడ లేదు. అంచేత, మన కారు యిద్దాం.''

దానితో యింకెవరూ మాట్లాడలేకపోయారు. రోజికి మరొకగుక్క కాఫీతాగి, "పై శనివారం మీలో యిద్దరు వాళ్ళతోబాటు వెళ్ళవచ్చు,'' అన్నాడు.

"అయితే, ప్రతిశనివారం రుడోల్ఫ్‌కే యిచ్చేస్తా వన్నమాట మన కారు?"

రోజికీ వెంటనే జవాబు చెప్పలేదు. రెండుక్షణాలు ఆగి, సీరియస్‌గా యిలా అన్నాడు: "అబ్బాయిలూ, పాలీ ఈమధ్య సంతోషంగా ఉండటంలేదు. మనలో ఏ ఒక్కరు విచారంగావున్నా, నాకుబావుండదు. పట్నంలో పెరిగినపిల్ల పల్లెపట్టున, కర్షకుని భార్యగా జీవించడం, అంత సులువైన పనికాదు. కీచులాటలు లేకుండా రుడోల్ఫ్, ఆ అమ్మాయీ సుఖంగా ఉండాలని నాకోరిక. మనస్పర్థలు ప్రారంభ మయాయా, యింక ఆపడం కష్టం. అవి రాకుండానే చూసు కోవాలి. నాగరీకంగా బతికినపిల్ల, మన పద్ధతులను అవలం బించేందుకు, వ్యవధికావాలి. ఆ వ్యవధి మనం కల్పించాలి. అందుకనే, పాలీ రుడోల్ఫ్‌లకి ఈ సంవత్సరాంతందాకా ప్రతి శనివారం కారు యిస్తానంటూంట."

"అవును, నాన్న చెప్పిందిరైటే. పాలీ మనలో కలిసిపోవాలి. అప్పుడుగాని రుడోల్ఫ్ సుఖపడడు."

తమకి చేతనైనంత నవ్వు మొగాలు ప్రదర్శించారు పిల్లలు. "వీక్ ఎండ్స్" అంటే వాళ్ళు మర్చిపోలేనివి.

రోజికీ ఆ సాయంత్రం తమకారుని రుడోల్ఫ్ ఇంటికి తీసుకువెళ్లాడు. రుడోల్ఫ్‌ది చిన్నయిల్లు. వాళ్ళింటికీ వీళ్ళిం టికీ మధ్య అరమైలు ఉంది.

సన్నగా నాజూకుగావున్న పాలీ వంటపని చూసుకుంటోంది. ఆమెవి నీలపుకళ్ళు; జుట్టు పసుపుపచ్చగా ఉంటుంది. పాప్‌గరల్ కనుబొమలకి మల్లేనే చిన్న కనుబొమలు.

"గుడ్ ఈవినింగ్ మిస్టర్ రోజికీ. రుడాల్ఫ్ ధాన్యపుకొట్ల వెనకాల ఉన్నాడనుకుంటాను," అంది పాలీ. రోజికీని మామా అనిగానీ, మేరీని అత్తా అనిగానీ ఆ అమ్మాయి పిల్చి యెరగదు. రుడాల్ఫ్ అందంగా హుషారుగా ఉండేవాడు. ఇద్దరూ ఒకే స్కూలులో ఒకే క్లాసులో చదువుకున్నారు. అందుకని ఆ అబ్బాయిని పెళ్ళి చేసుకుంది. రైతాంగానికిచెందిన, వాళ్ళ వాళ్లమీద, పాలీకి బంధుప్రేమ ఏమీ లేదు.

రోజికీని లోపలకి రమ్మనమని ఆ అమ్మాయి ఆహ్వానించలేదు. కాని, రోజికీయే లోపలికివెళ్ళాడు. "మా అబ్బాయిలు ఈ రాత్రి పట్నం వెళ్ళడంలేదు. మీరిద్దరూ వెళ్లి ఏదైనా సినిమా చూసివస్తారేమోనని కారు తీసుకొచ్చాను."

రోజికీవంక ఆశ్చర్యంతో చూస్తూ పాలీ అంది: "థాంక్యూ. నా వంటపని యింకా తెమలలేదు. బాగా అలిసిపోయివున్నాను - అంచేత నేను రాలేను. రుడాల్ఫ్ వస్తాడేమో కనుక్కుని, అతన్ని తీసుకువెళ్ళండి."

"నేను పాతకాలపువాణ్ణి - నాకు సినీమాలెందుకు? నేను సినీమాలు చూడను. కారులో వెళుతున్నప్పుడు అంత అలసటగా ఉండదు. ఇలాటి రాత్రివేళ, కారు ప్రయాణం లోని చల్లటిగాలి మొహానికి తగిలితే, అలసట అంతా తుర్రున పారిపోతుంది. మీరిద్దరూ చక్కగా వెళ్ళిరండి - ఇంట్లోపని ఏదైనావుంటే, నేను చూసిపెడతాను," అన్నాడు రోజికీ.

పాలీ సిగ్గుపడి, మొహంమీద పడుతున్న జుట్టుని వెనక్కి తీసుకుంది. "మీరు నాకు సాయం చెయ్యడమా?- ఎంతమాట అన్నారు!" అంది.

రోజికీ ఏమీ మాట్లాడలేదు. పాలీ బుజాలుపట్టుకు, "చూడు, యింటిపనులు చేసిపెట్టడం నాకు కొత్తకాదు. మేరీకి ఎన్నోసార్లు నేను సాయంచేశాను. మన చుట్టూతా కనిపించే అమ్మాయిల్లో, నువ్వు ఆణిముత్యంలా ఉండాలి. సరదాలనేవి చిన్నప్పుడేగాని పెద్దయాక కాదు. తొందరగా డ్రెస్ చేసుకో," అన్నాడు.

ఆ వృద్ధునికళ్ళ మెరుగులకీ, ఆ అనురాగబంధానికీ పాలీ ఆశ్చర్య చకితురాలయింది. "మీ చిన్నతనంలో మీరు పట్నాలలో నివశించేవారటగా! ఈ పల్లెపట్టునవుండే ఒంటరితనం, మిమ్మల్ని ఏనాడూ బాధించనే లేదా?" అని అడిగింది పాలీ సజల నేత్రాలతో.

ఆమె లేతచేతిని తన చేతిలోకి తీసుకు, ఆమెమొహం లోకి చూసి నవ్వుతూ, అంతా అర్థమయిందని తోపించే కంఠంతో, "పెద్దపట్నాలు భాగ్యవంతులకి. అవి బీదవాళ్లం దేందుకు కాదు," అన్నాడు.

"ఆసంగతి నాకు తెలియదు. మీరు న్యూయార్క్‌లో ఉన్నారుకదూ కొన్నాళ్లు!"

"లండన్‌లో కూడావున్నా; న్యూయార్క్‌కంటె పెద్దది. నాబతుకుతెరువు అక్కడే నేర్చుకున్నా. అదిగో రుడోల్ఫ్ వస్తున్నాడు."

"నాకు లండన్ గురించి చెబుతారుకదూ ఎప్పుడైనా?"

"చెబుతాను గాని, నేనంత చక్కగా చెప్పలేను. తొందరగా బట్టలు మార్చుకురా."

బట్టలు మార్చుకునేందుకు పాలీ పడకగదిలోకి దూరింది. రుడోల్ఫ్ ఖంగారుపడుతూ లోపలికివచ్చాడు. వీధి గుమ్మంలో తనవాళ్ల కారు ఉంది. వేళగానివేళ రావడానికి, ఏమికారణమా అని, అతని ఖంగారు.

"రుడోల్ఫ్, నువ్వూ పాలీ కలిసి యివ్వాళ సినీమాకి వెళ్లిరండి. మీకోసమని కారుపట్టుకొచ్చాను. తొందరగా నువ్వుకూడా బట్టలు మార్చుకురా."

"కారు మేము తీసుకెడితే, తమ్ముళ్ల మాటేమిటి? వాళ్లకివద్దా కారు?"

"ఈవారం అక్కర్లేదు. తరవాతసంగతి తరవాత చూసుకుందాం. ఇదిగో యిది దగ్గరవుంచు," అని కొడుకు చేతిలో ఒక డాలరు పెట్టాడు తండ్రి. "పాలీ చాలా మంచి పిల్ల. ఆ అమ్మాయికి దీనితో అయిస్ క్రీమ్ అవీ కొనిపెట్టు" అన్నాడు.

రుడోల్ఫ్‌కి చేతిలో డబ్బు ఆడటంలేదు. ఈపడు పంటలు పాడయాయి. పంటలు పాడైన సంవత్సరంలో పెళ్లి చేసుకున్నానే - అని రుడోల్ఫ్ ఎంతగానో వాపోతున్నాడు.

పదినిముషాల్లో కొడుకూ కోడలూ మంచిబట్టలు వేసుకు రెడీఅయారు. వాళ్లు వెళ్లాక, కుంపటిమీదవున్నవి దించి, వంటయిల్లంతా సవరించి, చుట్ట వెలిగించుకు సావిట్లో కూచున్నాడు - గడియారపు టిక్ టిక్ ఆలకిస్తూ.

జెక్ దేశస్థుడు స్వదేశపు స్త్రీని పెళ్లి చేసుకోవాలి గాని అమెరికన్ పిల్లని పెళ్లిచేసుకోవడం కాస్త సాహసమే! పాలీ ఒక బీదవితంతువు కుమార్తె. వాళ్లు నలుగురు అక్కచెల్లెళ్లు. నలుగురూ ఏదో ఉద్యోగాలు చేసేవాళ్లే! పెద్దమ్మాయి బాంకులో గుమాస్తా; రెండో అమ్మాయి సంగీత పాఠాలు నేర్పేది, మూడోదైనపాలీ, నాలుగో అమ్మాయీ షాప్ గరల్సగా పనిచేస్తూండేవారు. నలుగురివీ చక్కటికంఠాలు.

రుడాల్ఫ్‌ని పెళ్లి చేసుకోవడంతో పాలీకి పాతస్నేహి తులుపోయారు. అక్కచెల్లెళ్లకీ, చిన్నప్పట్నుంచీ పెరిగిన పరిసరాలకీ దూరమయింది. ఆమెకి యింటిపనులంటే మహా చీదర. కాని, గృహిణి అయాక గృహకృత్యాలు తప్పు తాయా?

రోజికీకి ఈదంపతుల గురించి కొద్దిగా వ్యాకులత పట్టు కుంది. పాలీకి ఈ పొలంపనులమీద విముఖత కలిగితే, రుడాల్ఫ్‌ని ఓమహాలోని ఫాక్టరీలో కార్మికునిగా చేరమని కోరవచ్చు. పెళ్లికి కావలసిన డబ్బు సంపాయించుకునేం దుకు, రెండేళ్లక్రితం కొన్నాళ్లపాటు అక్కడ పనిచేసివచ్చాడు కూడా రుడాల్ఫ్! పని తెలిసినవాడు కాబట్టి, అతనికి వెం టనే ఉద్యోగమిస్తారు. అదేగనక జరిగితే, తన కొడుకు భవిష్యత్తంతా భగ్నమైనట్టే! – అని అనుకున్నాడు రోజికీ. భూమిలేనిమనిషి అంటే, కూలిడబ్బులు సంపాయించుకున్న నౌకరు అన్నమాట – బతికున్నన్నాళ్లూ బానిస అన్నమాట. తనకొడుకు అలా అయితే ఇంకేముంది?

రుడాల్ఫ్ మితభాషి; ముక్కుకి సూటిగా పోయే మనిషి. నవ్వడం, నవ్వించడం – అతని కంతగా తెలియవు. సంవత్సరాది అయాక, వీళ్ళకి కాస్త వడ్రంగిపని చేసిపెడుతూ పాలీకి ఈ కబుర్లూ ఆ కబుర్లూ చెబుదామనుకున్నాడు రోజికీ. పాలీకి కాసిని నవ్వులూ, కేరింతలూ కావాలి.

ఆరిపోయినచుట్ట అవతల పారేసి, పొలాలకి అడ్డంబడి యింటికి వస్తున్నాడు రోజికీ. తమ వంటింట్లోని దీపం దూరానికి కనిపిస్తోంది. తనింకా విసీ స్ట్రీటులోని దర్జీ షాపులోనే పనిచేస్తూ వుండివుంటే, కర్మాగారాల్లో పనిచేసే తన కొడుకులు చప్పిదవడలేసుకు, ఆవురావురుమంటూ భోజనానికి వచ్చేవారు. భోజనాలు చేసేందుకు వంటిల్లుకూడా ఎక్కడ? ఆహార పదార్థాలు అమ్మే భోజనశాలలో ఒకళ్లమీద ఒకళ్ళుపడి......ఆ మురికి, ఆ హైరాణా, ఆ అమానుష జీవనం తలుచుకోకూడదు.

గాలి మరపైన, మసకగా మెరిసే నక్షత్రాలని ఒకసారి చూసి, నిట్టూరుస్తూ యింట్లోకి ప్రవేశించాడు. ఆ వంటిల్లు తనకెంతో ప్రీతికరమైనది; అంతకంటె ప్రియమైన వేమిటంటే, చుట్టూతా నిద్రిస్తున్న పొలాలూ, తళుకులు వెదజల్లే నక్షత్రాలూ, గంభీర ప్రశాంతిగల నిశీథమూను.

# 5

క్రిస్మస్ ముందురోజున చాలా చల్లగాఉంది. మంచు పడటంలేదుగాని, శీతలవాయువు ఎక్కడపడితే అక్కడ నాట్యంచేస్తోంది. రోజికీ యింట్లో క్రిస్మస్ సందడి చెప్పనే అక్కర్లేదు. ఆల్బర్ట్‌కి బిగువైపోయిన కోటు జాన్‌కి సరిపడే

టట్టుగా కుడుతున్నాడు రోజికీ. అలా కుడుతూ కూచుండగా, రోజికీకి తను లండన్‌లో గడిపిన రెండేళ్ళూ జ్ఞాపకంవచ్చాయి. జెరూసలీమ్ షెర్రీని చూడగానే ఆ వెనుకటిరోజులు జ్ఞాపకం వచ్చాయి.

లండన్‌లోకి వచ్చి పడేటప్పటికి తనకి పద్ధెనిమిదేళ్ళు. చేతిలో దమ్మిడీలేదు; నా అన్నవాళ్ళెవరూ లేదు. ఎవరో దూరపుబంధువు ఒకతను పిప్పరమెంట్లషాపులో ఉన్నాడట - ఆ యడ్రసొక్కటే తనదగ్గిర ఉంది. తీరా, అక్కడికి వెళ్ళి కనుక్కునేటప్పటికి, ఆ దూరపుబంధువు అమెరికా జారుకున్నాడు - అన్నారు. నిస్పృహతో, నిరాశతో, రోజికీ లండన్ వీధులమ్మట ఎన్నిరోజులో తిరిగాడు; ఉండేందుకు స్థలంలేదు; తినేందుకు తిండిలేదు; ఇంగ్లీషుభాష తెలియక పోవడంతో అతనిపని మరీ వుక్కిరిబిక్కిరి అయింది. భాష రాని రోజికీ ఆ మహాపట్నంలో పడరాని పాట్లు పడ్డాడు.

అదృష్టవశాత్తూ జెక్‌భాష తెలిసిన ఒకజర్మను టైలర్‌ని కలుసుకోవడం తటస్థించింది. ఆ జర్మనుటైలర్ వియన్నా నగరానికి చెందినవాడు. చవకబజారులో, ఒక జోళ్లషాపు అడుగున, యితని దర్జీషాపు ఉండేది. పనివాళ్లని పెట్టుకోతగ్గంతపని, ఆదర్జీకిలేదు. కుర్రవాడు తిండీ తిప్పలు లేక బాధపడుతున్నాడుకదా అని కనికరించి తన షాపులో

పెట్టుకున్నాడు. జీతం ఏమీ లేదు ; తమతో బాటు యింత తిండి పెడతానన్నాడు. కస్టమర్స్ యిళ్లకి, కుట్టినబట్టలు తీసుకు వెళ్లినప్పుడు, వారు యిచ్చే తృణమో పణమో - అదే జీతంగా భావించుకోమన్నాడు.

రోజికీకి ఆ ప్రకారం లభించిన తృణాలు బహుస్వల్పం. ఎందుకంటే, ఆ ట్రైలర్ కస్టమర్స్ షాపుకేవచ్చి తమ బట్టలు తీసుకువెళ్లేవారు. ఏమయితేనేం, రోజికీకి తలదాచుకునేందుకు స్థలమంటూ ఒకటి దొరికింది.

దర్జీ అతను మేడపై భాగంలో మూడుగదుల్లో ఉండేవాడు. ఒకటి వంటగది, ఒకటి పడకగది - పడకగదిలోనే దర్జీ అతనూ, అతనిభార్యా, అయిదుగురుపిల్లలూ నిద్రపోయేవారు - మూడోది నడవ (లివింగ్ రూమ్). ఆ నడవలోని రెండుమూలలూ చెరొకమనిషికీ కేటాయించబడ్డాయి. గుర్రపు వెంట్రుకలు గుచ్చుకునే కర్రసోఫాలో పడుకునేవాడు రోజికీ; వయొలిన్ నేర్చుకుంటున్న ఒక మురికి బాలుడికి, రెండవమూల అద్దెకివ్వబడింది. ఆ మురికిబాలుడు వయొలిన్ అక్కడే సాధనచేసేవాడుకూడా. రోజికీకూడా మురికిగానే ఉండేవాడు. మురికిగా ఉండకుండా వుండేందుకు మార్గమేది? దర్జీ అతనిభార్య రాత్రింబవళ్లూ చాకిరీ చేస్తూండేది - విసుగూ విరామంలేని చాకిరీ. ఇక నల్లులూ దోమలూ సంగతి చెప్పనే అక్కర్లేదు. ఆమె ఎంత శ్రమపడీకూడా వాటిని

నిరోధించ లేకపోయేది. ఒక్కొక్క రోజున, తనకి మిగలక పోయినా, తమని నమ్ముకున్న యిద్దరు కుర్రాళ్ళకీ మాత్రం కడుపునిండా తిండిపెట్టేది. నిర్భాగ్యులైన ఈ ఆకలి బాలురిద్దరికోసం, ఆమె ఎన్నిసార్లో పస్తుపడుకుంది.

తనకీ చెరనుంచి విముక్తిలేదా ? - అనుకునేవాడు రోజికీ. శుభ్రమైన చొక్కా అనేది ఈజన్మకి ధరించగలనా?- అనుకునేవాడు. కాని, ఏమి చెయ్యగలడు? తూట్లుపడ్డ గుడ్డలు, పూర్తిగా చినిగి వాలికలైపోతే, తనగతి ఏంగాను ?

స్మృతులు నెమరువేస్తూ అలా కుడుతూ కూచున్నాడు రోజికీ. కుట్టడం అయిపోయింది. పొద్దుట్నుంచీ ఆకాశం బూడిదరంగులో ఉంది. సూర్యరశ్మేలేదు. నాలుగుగంటలకే సంజెవేళ అయింది. రుడోల్ఫ్, పాలీ ఆరాత్రి భోజనానికి వస్తున్నారు. గడ్డం గీసుకుని బట్టలుమార్చుకు కూచుందామని లేచాడు రోజికీ.

భోజనాలయాయి. ఆ తర్వాత కబుర్లలో పడ్డారు. క్రిస్మస్ సమయంలో మంచు పడకపోవడం బాగులేదన్నారు చిన్నపిల్లలు. నిజమేనన్నారు అందరూ. దట్టంగా మంచు పడటం గోధుమపంటకి మంచిదట.

"నిరుడికి మల్లేనే ఈ ఏడూవుంటే, పంటలు సర్వ

నాశనమవుతాయి ; మనచుట్టుపట్ల వాళ్ళందరికీ గడ్డురోజులు ఎదురౌతాయి,'' అన్నాడు రుడాల్ఫ్.

రోజికీ చుట్టముట్టించి, గడ్డురోజులంటే మీకేం తెలుసు! మీకేమీ అప్పులేవు. తినేందుకు కమ్మటి తిండీ, తాగేందుకు పరిశుభ్రమైన నీరూ ఉన్నాయి. అన్నోదకాలు వున్నవాళ్ళకి కష్టకాలమేమటి, కరువు కాటకాలేమిటి?'' అన్నాడు.

''నాలుగుడబ్బులు గిట్టనప్పుడు వ్యవసాయం చేసి ప్రయోజనమేమిటి? దీనిబదులు, మరో ఉద్యోగం చేసుకో వచ్చుగా!'' అన్నాడు రుడాల్ఫ దుడుకుగా.

''అలాగా!'' అన్నాడు తండ్రి

తండ్రీ కొడుకులు తీవ్రవాగ్వాదంలో పడటానికి పూర్వం, మేరీ వాళ్ల మాటల్లో కల్పించుకుంది.

''అబ్బాయ్, కష్టకాలమంటే మీకాలపువాళ్లకి తెలియదు. మాకాలంలో మేము ఎన్నో కరువుకాటకాలు అనుభవించాం. వాటన్నిటినీ దాటుకువచ్చాం. మీనాన్నకి కష్టకాలం అంటే భయమనుకున్నావా? ఎబ్బే - అదేంలేదు. మీరు చాలా చిన్నపిల్లలు అప్పటికి. జులై నాలుగోతేదీ. ఆవేళ మహోధృతంగా ఉష్ణవాయువులు వీచాయి. ఎంతటి వేడిగాలులంటే, అవి సమస్తాన్నీ తగలబెట్టేశాయి.

"మీనాన్న పొలానికి వెళ్లారు. జులై నాలుగు పం డగకదూ - అంచేత నేను వంటయింట్లో భోజనపదార్థాల హడావిడిలో ఉన్నాను. ఆఏడాది ద్రాక్ష విరగకాసింది. ద్రాక్షతో రకరకాల పదార్థాలు చేస్తున్నాను. వంట యింట్లోవున్న నాకే, వేడిగాళుపు భరింపరానంతగా ఉంది. బయటపొలంలోవున్న మీనాన్నసంగతి యింక చెప్పాలా? చీకటిపడేదాకా రానని చెప్పి వెళ్లినాయన, మధ్యాహ్నం మూడుగంటలకి వచ్చారు. ఏం, యిలావచ్చారేం? - అని అడిగాను. ఆ, ఏమీలేదు. వేడిగాల్పులూ ఎండా భరించ లేకవచ్చేశాను. ఇవ్వాళ జులై నాలుగు అన్నసంగతి జ్ఞాప కం వుందికదా! కమ్మటిభోజనం తయారుచేసివుంచు - అన్నారు. ఉక్కఎక్కువగా వుందిగనక చెరువుకివెళ్లి స్నానం చేసివస్తానని, పెద్దపిల్లలు ముగ్గుర్నీ వెంటేసుకు స్నానాని కెళ్లి, చాలాసేపు జలకాలాడి, పరిశుభ్రమైన బట్టలువేసుకు, యింటికొచ్చారు.

"చాలా ఉక్కగా ఉంది. అంచేత, ఆరుబయట పిక్నిక్ చేసుకుందాం - అన్నారు. సరేనన్నాను. సాయంత్ర మవడంతో ఎండవేడిమి తగ్గింది. కాని, చెట్ల ఆకులు వడిలి పోయినట్టు అగుపిస్తున్నాయి. ఈవేడి పళ్లతోటలకీ, పంట పొలాలకీ మంచిది కాదనుకుంటాను - అన్నాను మీ నాన్నతో భోజనాల వేళప్పుడు."

"పంటపోలాలా? ఈ ఏడు పంట ఏముంది? - అన్నారు ఆయన.

"అదేమిటి అలా అంటారు? మన నలభై ఎకరాల్లోని గోధుమపంట? - అన్నాను.

"గోధుమగింజ మిగిత్తేగా! మధ్యాహ్నం మూడు గంటలవేళకి, ఈ ప్రాంతాలవున్న పంటఅంతా, భలే చక్కగా ఉడికింది. నువ్వు మూకుడులో వేయిస్తావే, అలా - అన్నారు మీ నాన్న.

"నేను మొదట నమ్మలేకపోయాను. ఇన్నాళ్ళ రెక్కలకష్టం అగ్నిపాలయిందని వినేటప్పటికి ఏడుపొచ్చింది.

"కాని మీ నాన్న - ఈ ఏడుపంట, మంటఅయింది గనకనే, మనం పిక్నిక్ చేసుకుంటున్నాం - అంటారు. ఏం జెప్పను? అలాటిమనిషి మీ నాన్న.

"ఇరుగుపొరుగు వాళ్ళలో కొందరు, దైవికంగా సంభవించిన నష్టాన్ని తలుచుకు తలుచుకు ఏడ్చారు. ఏడవడంవల్ల వాళ్ళకి కలిసొచ్చిందీలేదు; మర్చిపోవడంవల్ల మనకి పోయిందీలేదు. ఎటొచ్చీ, కొందరు ఏడ్చిఏడ్చి వాళ్ళ ఆరోగ్యాలు పాడుచేసుకున్నారు."

నాన్న దేర్రైటు అనుకున్నారు చిన్నపిల్లలు. "నాన్న దేంర్రైటు, ఈ పదిహేనేళ్ళలో చుట్టుపక్కలవాళ్లు ఎంత

పైకివచ్చారు, ఎంత భాగ్యవంతులయూరు! నాన్న అవలం బించే పంథాలో ఎక్కడో పొరబాటువుంది - అనుకున్నాడు రుడోల్ఫ్. పాలీ మనోభిప్రాయమేమిటో తెలుసుకోవాలని వుంది రుడోల్ఫ్‌కి. పాలీకి నాన్నంటే యిష్టమే! ఇష్టమేగాక తనవైపు వాళ్ళంటే ఏదో భయంకూడావుంది. పదిమందిలో కలిసిపోయేటట్టు వుండాలిగాని ప్రత్యేకంగా కనపడకూడదు - అనుకుంటుంది పాలీ. అది ఆమె తత్వం,

అత్తగారి సహృదయతా, అత్తగారి పద్ధతీ కోడలికి యింకా నచ్చడంలేదు.

మేరీ కథ చెప్పడం అయిపోయాక, రోజికీ తనచేతిలో వున్న చుట్ట అవతల పారేసి, యిలా ప్రారంభించాడు :

"అబ్బాయిలూ, లండన్‌లో నేను గడిపిన కష్ట దినాలగురించి మీకు వినాలనివుంది కదూ - చెబుతాను." నుదుటిమీది గీతలు అరిచేతితో తుడుచుకు, లండన్ గురించి ముఖ్యంగా పాలీ వినాలని, యిలా ప్రారంభించాడు :

"లండన్‌లో ఒక దర్జీ అతను షాపులో నేను పని చేస్తూండేవాడినని మీకు తెలుసు. అక్కడ గడిచిన ఒక క్రిస్మస్ నేను ఎన్నటికీ మర్చిపోలేను. అవి చెడ్డరోజులు ; చేతినిండా పనిదొరికేదికాదు ; మా యజమానే యెంతో బీదరికంతో జీవిస్తూండేవాడు. లండన్‌లాటి మహాపట్నంలో బీదవానిగా జీవించడమంటే మాటలుకాదు - మహాకష్టం.

షాపులనిండా వస్తువులు, వీధులనిండా వస్తువులు – జేబులు మట్టుకుఖాళీ. నాకు ఓవర్ కోటు లేకపోయినా, కరుడు కట్టుకుపోయే చలి అయినా, క్రిస్మస్ అందాలు చూదామని లండన్ వీధులమ్మట బయలుదేరాను. ఇక, ఆకలో ఆకలి! ఆరోజుల్లోని నా ఆకలి చెప్పతరంకాదు.

“చేతులూ కాళ్లూ కొంకర్లు పోయేచలి. దర్జీ అతని భార్య యిచ్చిన చిన్న బ్రెడ్ ముక్కే ఆరాత్రిభోజనం. ఆ భోజనమయ్యాక వీధులవెంటపడ్డాను. ప్రతిచోటా సంగీతమే; అన్నిచోట్లా ఆనందతోరణాలే. కాళ్లలో శక్తివున్నంతసేపూ తిరిగాను. ఇల్లుచేరుకునేటప్పటికి కడుపు ఆకలితో మండి పోతోంది. ఆకలి విషయం మర్చిపోయి, తెల్లారేదాకా నిద్ర పోదామని మనసుకి బుద్ధిచెప్పుకున్నా.

“నడవలోని నామూాల చేరుకునేటప్పటికి, ఏదో కమ్మటివాసన తగిలింది ముక్కులకి. ఆవాసనతో నాకునిద్దర పట్టలేదు. క్షణక్షణానికీ వాసన మరీకమ్మగా అవడం మొదలెట్టింది. ఆవాసనేదో తెలుసుకునేదాకా నిద్దరపట్టలేదు. కిటికీ రెక్కలు తెరిచినప్పుడు లోపలికిపడేకాంతితో, అదేమిటో చూశాను. కమ్మటివంటకం (roast goose). నా కళ్లని నేను నమ్మలేకపోయాను. అది నిజంగా తినేదవునా కాదా అని, కిటికీ దగ్గిరికి తీసుకువెళ్లి వెల్తురులో చూశాను. తినేదే! అయినా, రుచిచూసి తెలుసుకుందామని రుచి

చూశాను. మర్నాడు నావంతుకి వచ్చేది తినడం మానేద్దా మనీ, యిప్పుడు కాస్త ముక్కతిని, నిద్రపోదామనీ అనుకున్నాను. కాస్తముక్క, కాస్తముక్క అనుకుంటూ సగం పైగా తినేశాను.''

కథకుడు ఒక్కసారి తనకథనం ఆపాడు. పిల్లలు దడదడా చప్పట్లుకొట్టారు. ఆడపిల్ల జోసఫిన్ తండ్రి కుర్చీదగ్గిరికి వచ్చి, మెడదగ్గిర ముద్దెట్టుకుంటూ, ''పాపం, మానాన్నకి ఎంత ఆకలేసిందో!'' అంది.

''అది ఎప్పటిమాటో - యిప్పటిసంగతికాదు. మీ అమ్మ వంటింటి తాళాలు చేతబుచ్చుకున్నప్పట్నుంచీ ఆకలనేది ఎరగను.''

''సరి, సరి. ఆతర్వాత కథచెప్పండి,'' అని అడిగింది పాలీ.

''సగంపైగా తిన్నతర్వాత, నేను ఏమి చేశానో నాకు తెలిసింది. కడుపులో బాధ పోయిందిగాని హృదయంలో బాధ పట్టుకుంది. తెల్లారిలేచాక, యజమానిభార్య నాగురించి ఏమనుకుంటుంది? ఎంతకష్టపడి కొన్నదో కదా అది! వయొలిన్ అబ్బాయికంటె నేను నమ్మకస్తుణ్ణి అని కదా, నావాటాలో ఉంచింది! వాళ్ళ క్రిస్మస్‌పండగ పాడుచేసిన పాపిష్టినినేను. జోళ్లువేసుకు వీధిలోకి వచ్చాను. యజ

మాని భార్యకి ఈ మొహం చూపించడంకంటె, నీళ్ళలోకి దూకిచస్తే మేలు - అనుకున్నాను. కాని, నేను ఆరకం కుర్రవాణ్ణి కాదు.

"రాత్రి పన్నెండు దాటింది. విపరీతమైన చలి. వెచ్చటి పానీయాలుతాగి, ఖుషీగావున్న స్త్రీ పురుషులు, అక్కడక్కడ అగుపడుతున్నారు. పోలీసువాళ్ళ కంటపడ కుండా, స్ట్రాండ్, న్యూ ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్ - యివన్నీ తిరిగాను. పెద్ద జర్మన్ హోటల్ ఒక దానిముందు నుంచున్నాను. లోపల విందు భోజనాల అలజడి. పెద్దపెద్ద కిటికీల వెనకనున్న దీపాలు వింత వెలుగులు ప్రసరిస్తున్నాయి. ఇంతలో యిద్దరు మొగవాళ్లూ యిద్దరుఆడవాళ్లూ ఆ హోటల్ నుంచి బయటికివచ్చారు. ఇక తినలేనంతతిని, తాగలేనంత తాగినవాళ్లలా మహా సంతోషంగా వున్నారు ఆ స్త్రీ పురుషులు నల్గురూ. ఆస్ట్రియనులు మాట్లాడినట్లుగా గాక, అసలు జెక్‌లు మాట్లాడినట్టుగా జెక్ భాష మాట్లాడుతున్నారు వాళ్లు.

"నాకాక్షణాన మతిపోయిం దనుకుంటాను. అటువంటిపని నేనంతకి క్రితం ఎప్పుడూ చెయ్యలేదు. స్వదేశస్తులారా: పండగపూటా ఈ బీదవాడు ఒక బాతుని కొనుక్కోగలిగేపాటి డబ్బులు ధర్మంచేయండి - అని యాచించాను.

"వాళ్లు ఒక్కసారి నవ్వుకున్నారు. ఆ యిద్దరు స్త్రీలూ నన్ను ఎంతో దయతో హోటల్‌లోకి తీసుకువెళ్ళి కేకులు పెట్టించి, వేడివేడి కాఫీ యిప్పించారు. నేను లండన్ ఎలా వచ్చానో, యిక్కడ ఏమిజరిగిందో, నేను ఎలా బతుకుతున్నానో - సమస్తం వారికి నివేదించాను. నా పేరూ యడ్రసూ ఒక కాయితంమీద రాసుకుని, పది షిల్లింగులు నా చేతిలో పెట్టారు.

"మార్కెట్ అక్కడి కెంతోదూరం కాదు. గబగబా మార్కెట్‌కివెళ్ళి, పెద్దబాతు ఒకటీ, బంగాళదుంపలు, వుల్లిపాయలు, పిల్లలకి కేకులూ, నారింజలూ - నేను ఎన్ని మోసుకువెళ్ళగలనో అన్నీపట్టుకు, యింటికి బయలుదేరాను. నేను యిల్లుచేరుకునేవేళకి, అందరూ యింకా నిద్రపోతున్నారు. అన్నీ వంటింట్లోపెట్టి, నేను నాపక్కమీదకివెళ్ళి పడుకున్నాను. యింటిల్లపాదీ ఆరోజున ఎంత ఆనందించారో చెప్పలేను. వయొలిన్ కుర్రాడుకూడా ఆ రోజున కడుపునిండా భోంచేశారు.

"రెండుమూడురోజులు గడిచాక, యిద్దరు పెద్దమనుషులువచ్చి, మా యజమానిని నాగురించి అడిగారు. నేను చాలా మంచికుర్రవాణ్ణని యజమాని చెప్పాడు. వచ్చిన యిద్దర్లో ఒకతను న్యూయార్కులోవుండే ఒక పత్రికకి ఎడిటర్ ; రెండో అతను ఒక పెద్ద వ్యాపారి. 'ఖర్చులు మేము

పెట్టుకుంటాం, అమెరికా వస్తావా?' అని అడిగారువాళ్లు. 'ఇక్కడవుండి నువ్వు బావుకునే దేమీలేదు. వృద్ధిలోకి వస్తావ్ - వాళ్ళతో వెళ్ళు' - అన్నాడు మాయజమాని. ఆ విధంగా నేను న్యూయార్కు వచ్చాను.''

ఆరాత్రి రుడోల్ఫ్, పాలీ చెట్టాపట్టాలేసుకు, వెన్న మీదపాడిచే చల్లగాలిలో, పొలాలకి అడ్డంబడి నడుస్తూ, తమయింటికి వస్తున్నారు. రుడోల్ఫ్‌కి ఎంతో సంతోషంగా ఉంది. పాలీ అంది: ''సంవత్సరాదినాడు వాళ్లందరినీ మనింటికి భోజనానికి పిలుద్దాం.''

''అలాగే పాలీ!'' అన్నాడు రుడోల్ఫ్, ఎంతో ప్రేమగా. ఎంతయినా, పాలీ తరఫువాళ్లకి లోకపు రీతి నీతులు బాగా తెలుసు - అనుకున్నాడు మనసులో.

# 6

ఆఏడు శీతకాలం రైతాంగానికి గడ్డుకాలమైపోయింది. క్రిస్మస్ అయాక మళ్లీ మంచూలేదు, వర్షమూలేదు. ఫిబ్రవరికి తగ్గవలసిన చలి మార్చికికూడా తగ్గలేదు. రోజికీ అస్తమానం కిటికీదగ్గిరే కూచునేవాడు. తనూ తనపిల్లలూ ఆ ఏడు నాటిన విత్తనాలు మంచు పాలయాయి; నేల అంతా గడ్డకట్టుకుపోయింది. మళ్లీ అదంతా దున్ని, వేరేవిత్తనాలు

నాటాలి. వెనక యిలాంటిది సంభవించకపోలేదు - చాలా సార్లు సంభవించింది. కాని, అప్పుడు తను వయసులో ఉన్నాడు. ముందేమి జరగనుందో అనే చింత లేదు. మేరీకి తను తెలుసు ; తనకి మేరీ తెలుసు - అంచేత యిద్దరూ ఎలాగో అలా నెట్టుకువచ్చేవారు. పాపం, రుడాల్ఫ్ పాలీలు చిన్న వాళ్లు. వాళ్లకింకా కష్టసుఖాలు తెలియవు.

కిటికీకి దిగువని పూలచెట్లు. వాటిరెమ్మలు కిటికీ గ్లాసుకి కొట్టుకుంటూండేవి, గాలివీచినప్పుడల్లా. వెనక న్యూయార్కు రోజుల్లో, ఆదివారాలప్పుడువచ్చిన ఆలోచనలు రాసాగాయి రోజికీకి. తనకేం కావాలి? - అనేది ఆనాటి అన్వేషణ ; తనపిల్లలకేం కావాలి? - అనేది ఈనాటి అన్వేషణ. తను వెళ్ళిపోయాకకూడా, తనపిల్లలు ఈగడ్డమీదనే వుండాలనే తపన తనకెందుకో!

వాళ్లు కష్టపడి పనిచేయాలి. ఎంత కష్టపడి పనిచేసినా, జీవనోపాధికంటె ఎక్కువ మిగలదు. వ్యవసాయంలో సాధక బాధకాలు లేకపోలేదు. ఎండ అనక, వాన అనక - నడుం వొంచి కష్టపడాలి. కాలం గడిచినకొద్దీ కష్టాలు అలవాటై ఒకదారిని పడతాం. ఇందులోవున్న సుగుణ మేమిటంటే, మనది అనేది మిగులుతుంది. మనకి మిగిలింది మనదే! యజమాని మనుషులు చెప్పేది రైటా, సమ్మెదారులు చెప్పేదిరైటా అను సంశయంలో పడనక్కర్లేదు - ఎవరిది

రైటయినా తలకుచుట్టుకునే కష్టాలు మనకే! ఎవరు వంచకులు, ఎవరు దుర్మార్గులు? - అని విడమరిచి చూసుకోవలసినబాధలేదు. మోసకత్తెలకీ, మోసకారులకీ భయపడనక్కర్లేదు.

గ్రామీణ జీవనంలో, మనం నీచులకి ఎడంగా వుండవచ్చు. పట్నంలో అలా కుదరదు. ఇరుగు పొరుగుల్లోవుండే కుటిలత, వంచన, రాక్షసత్వం - యిలాటివి మనలోకూడా భాగాలుగా అయిపోతాయి. విషపూరితులైన అల్పులవల్ల, మానవునికి ఎక్కువహాని జరుగుతోందంటాడు రోజికీ. తను లండన్‌లో చూసిన విషపు మొహాలు యిప్పటికీ బుర్రలో మెదుల్తున్నాయి. గ్రామీణుల్లో చెడ్డవారు లేదనికాదు - ఉన్నారు. కాని వీరి చెడ్డతనం కాకలుతీరిన కాఠిన్యతగా మారి పదునైనదిగా వుండదు. తడిగుడ్డలతో గొంతుక కొయ్యడం మాదిరి వుండదు. విషపూరిత వాతావరణంలో పరస్పర వంచనతో బతుకుతారు పట్టణప్రజ. తను దర్జీగా ఉన్నప్పుడు, తోటివారు యిద్దరు చనిపోతే, వారి ఉత్తర క్రియలు చూశాడు. ఉత్తరక్రియలుకూడా వ్యాపార సరళిలోనే జరుగుతాయి. చచ్చిందీ, బతికిందీ ఎవరికీ అఖ్ఖర్లేదు. ఇక్కడ అలానా? వొంట్లో నలతగా వుందంటే, మన కష్టసుఖాలు తెలిసిన డాక్టరు మందిస్తాడు; గుటుక్కుమన్నామంటే, 'అయ్యో' అని కంట తడిబెడతారు అందరూ.

సద్వర్తనులైన పిల్లలకి ఫాక్టరీలకంటె పొలాలే మంచివి. తన పిల్లలలో ఎవరైనా కొక్కిరాయలు వుంటే, వాళ్ళని పట్నం పంపించేవాడు. కాని తనపిల్లలు అలాంటి వాళ్లుకాదు. పొలంపని అంటే విసుక్కుంటున్న రుడోల్ఫ కూడా చాలా ఉదారుడు. మానవుల్లోవుండే నిర్దాక్షిణ్య క్రూరత్వం, తనకొడుకులు చూడకుండా వుండాలని, రోజికీ కోరిక. ఆ కాఠిన్యం వాళ్ళకి తెలియనీయకుండా పెంచాడు. ఆకలీ, దారిద్ర్యం - ఆరెండూ మహాచెడ్డవి.

వసంతాగమనంతో ఆకాశానికి నీలిరంగువచ్చింది. కాని, ఒక్కబొట్టు వర్షం లేదు. పిల్లలు పొలాలు దుక్కి దున్నుతున్నారు. నేల పెళుసుగావుంది. దుమ్ము - మేఘాలు వీస్తున్నాయిగాని నింగిమేఘాలు ఎక్కడాలేవు.

పచ్చికబీడులో మొలిచిన ముళ్లచెట్లవల్ల పక్కనే వున్న పంటపొలాలకి నష్టం కలగవచ్చునని రోజికీ కొడుకులకి చెప్పాడు. అదేం ఫరవాలేదన్నాడు రుడోల్ఫ.

ఒకరోజు ఉదయం రుడోల్ఫ, పక్కపట్నానికి, పనివుండి వెళ్లాడు. అతని పొలంలో జరగవలసిన పనిని, పనివాళ్లు చేస్తున్నారు. రోజికీ పెద్దకొడుకు యింటికివెళ్లి, గుర్రబ్బగ్గీ తీసుకొని, ముళ్లకంచెలు కొట్టేందుకు బయలుదేరాడు. అలాగే పట్నంవెళ్లి డాక్టరునికూడా చూసివద్దా మనుకున్నాడు.

పదినిముషాలపాటు ముళ్లకంచెలు కొట్టాడో లేదో, ఊపిరి పీల్చడం కష్టమయింది.

గుండెల్లో పోటుపొడిచినట్లయింది. గుర్రబ్బగ్గీనుంచి దిగినవాడు, మళ్లీ ఎక్కనుకూండా ఎక్కలేకపోయాడు. కత్తి పుచ్చుకు, వెన్నులోనుంచి గుండెలదగ్గిరికి పొడుస్తున్నట్టు వుంది. గాలిమర సమీపానికి అతికష్టంమీద చేరుకుని, అక్కడవున్న నిచ్చెనని ఆనుకు నిలబడ్డాడు. పరుగుపరుగున తనవైపుగా పరిగెత్తుకొస్తున్న పాలీ కనిపించింది. ఒక్క త్రుటిలో రోజికీ దగ్గిరికివచ్చి, అతను పడిపోకుండా ఆసరగా పట్టుకొంది; నెమ్మదిగా అతనిచేత అడుగులువేయిస్తూ యిం టికిచేర్చింది.

ఇల్లుచేరుకునేవేళకి రోజికీబాధ అపరిమితంగా ఉంది; కాళ్లు నేలమీద నిలబడటంలేదు; కళ్ళు మూసుకుపో తున్నాయి. పాలీ తనని మంచంమీద పడుకోబెట్టి, వేన్నీ ళ్లలో తడిపిన తువ్వాలు గుండెలమీద ఉంచడందాకానే అతనికి జ్ఞాపకం ఉంది. వేన్నీళ్ళు అలాకాగుతున్నాయి; వేన్నీళ్ళకాపు అలాపెడుతూనే ఉంది పాలీ! ఒక గంటసేపు అయేటప్పటికి, మనిషంతా నీలంగా అయిపోయి, చెమటలు కార్చడం మొదలెట్టాడు.

ఆ చెమటలతో బాధ నెమ్మదిగా తగ్గింది. బిట్టగరు

చుకుపోయినపళ్ళు విడివడ్డాయి. కళ్ళచుట్టూతావున్న నల్లటి చారలు మాయమయాయి. మొహంలోకి కొద్దిగా జీవకళ వచ్చింది.

కోడలు చొక్కా గుండీలు పెడుతూండగా అన్నాడు రోజికీ: "హమ్మయ్య! ఇప్పటికి స్తిమితంగా ఉంది. పాపం, నిన్ను చాలాశ్రమపెట్టాను."

"దానికేంగాని, నిజంగా నొప్పి తగ్గిందా? మిమ్మల్ని రెండు నిముషాలపాటు వొదిలి వెళ్ళేందుకని అడుగుతున్నా - అత్తగారికీ వాళ్ళకీ టెలిఫోన్ చేసివస్తా."

రోజికీ కళ్ళు చిట్లించి, "ఇప్పుడు టెలిఫోన్ చెయ్యకు. మేరీ ఖంగారు పడుతుంది. ఇక్కడ బాగానే వుందిగా! మళ్ళీ మామూలు మనిషినయేదాకా యిక్కడ పడుకోనీ - నీకు యిబ్బంది లేకపోతే!"

"ఇక్కడ మీరు వుండటం నాకు కష్టమేమిటి? మీ బాధ చూస్తూంటే, నాగుండె చెరువయింది," అంది పాలీ.

పాలీని కూచోమని సంజ్ఞ చేస్తూ, ప్రేమపూరిత వీక్షణాలతో రోజికీ అన్నాడు: "చిన్నపిల్లవి నువ్వు - నిన్ను చాలా కష్టపెట్టాను. హడలగొట్టేసి వుంటాను."

పాలీ అతని చేతిని తన చేతిలోకి తీసుకు, అతని మొహంమీది స్వేదబిందువుల్ని తుడిచింది. రోజికీ చూపుల్లో

అనురాగం ధారలుగా కురుస్తోంది. కోడలువంక ఆనందాతి రేకంతోచూస్తూ, "అయితే......" అన్నాడు.

"అవును. ఇంకా ఎవరికీ చెప్పలేదు. అమ్మకిగానీ, రుడాల్ఫ్‌గాని యెవరికీ యింకా చెప్పలేదు. అవును," అంది పాలీ సిగ్గుతోనూ చనువుతోనూ.

రోజికీ ఆమె అరచేతిని వాత్సల్యంతో నొక్కాడు. రోజికీ వేళ్ళకి వేడిమి వచ్చింది. అతని కళ్ళు కాంతివంతము లయాయి.

"పాపని చూడాలని మహావుందిసుమా!" అంటూ మందస్మిత వదనంతో కళ్ళుమూశాడు కాసేపు. పాలీ ఒక్కర్తే కూచుంది. ఎన్నో ఆలోచనలు వచ్చాయి పాలీకి. ఈ ప్రపంచంలోకి తనని తీసుకొచ్చిన తల్లికంటె, తనను పెళ్లాడి పోషిస్తున్న రుడాల్ఫ్‌కంటె, తనకి తెలిసిన అందరి కంటె ఈ వృద్ధుడైన రోజికీ తనని యెక్కువ ప్రేమిస్తు న్నట్టుగా అనిపించింది. అదేమిటో అర్థంగాక ఉక్కిరిబిక్కి రయింది. ఎందుకాయనకి తనమీద యింత వెర్రిప్రేమ? ప్రేమించడంలో రోజికీకి ఏదో ప్రత్యేక నేర్పు వున్నట్టువుంది - చిత్రలేఖనం చూసేందుకు, సంగీతం వినేందుకు వుండవలసిన అభిరుచిలాంటి నేర్పు! కాంతివెల్లువలాంటి ప్రశాంత ప్రేమఅది! కాంతిని చూసేందుకు కళ్ళు వుండాలి - అలాగే యిదీను.

అతని స్పర్శలో, అతని చూపులో, అతని మాటలో ఆ ప్రశాంత ప్రేమ కనిపిస్తుంది.

రైతులంటే మొరటుగా ఉంటారు. కాని, ఇతను అలాంటివాడు కాదు. పాదరసంలాంటి అరిచేతులతనివి. వెచ్చదనం, మెత్తనా రెండూ మిళితమై ఉంటాయి ఆ అరిచేతుల్లో. బండ దేరిన చేతులు కావవి - అతి నాజూకైనవి.

ఆ గంటసేపట్లో పాలీకి ఏదో జ్ఞానోదయమయినట్లుంది. మానవజీవితం గురించిన మహత్తరసత్యాలు రోజికీ నుంచి తెలుసుకున్నట్లయింది. భాషలో యిమడని భావాలు అనుభవమయాయి.

రుడాల్ఫ వస్తున్నట్టు కారుచప్పుడవగానే, పాలీ వీధి వాకిట్లోకి పరుగెత్తుకొచ్చింది.

"మీ నాన్నగారికి చాలాజబ్బుచేసింది. ముళ్ళకంపల దగ్గిరనుంచి మన యిల్లు చేరుకునేటప్పటికి బ్రహ్మప్రళయమయింది. ఆబాధ చూసి, బతుకుతారనుకోలేదు," అంది పాలీ.

"నాన్న ఎక్కడ?" అన్నాడు రుడాల్ఫ్, కారులో నుంచి దూకుతూ.

"లోపల ఉన్నారు. పక్కమీద పడుకునివున్నారు - నిద్రపోతున్నట్టున్నారు. చాలాభయమేసింది, రుడాల్ఫ్,"

అంది పాలీ రుడోల్ఫ్ చేతివేళ్లు తన చేతి వేళ్ళలోకి తీసుకుంటూ. ఇద్దరూ కలిసి లోపలికి వెళ్ళారు. తనకేం ఫరవాలేదనీ శుభ్రంగావున్నాననీ రోజిక్ అన్నాడు. కాని, అతన్ని వాళ్ళి య్యింటికి ఎంతో పదిలంగా తీసుకెళ్ళి, మంచం పక్కా వేసి, పక్క మీద పడుకోమన్నారు.

మర్నాడు ఉదయానికి రోజిక్ యథాప్రకారంగా ఉన్నాడు. డైనింగ్ టేబుల్ దగ్గిర మేరీతో, కాఫీ రోజూ కంటె బావుందన్నాడు. డాక్టరు చెప్పే కల్లిబొల్లి కబుర్లు నమ్మకండేం - అన్నాడు పిల్లలతో. తను రోజూ కూచునే కిటికీదగ్గిర కూచున్నాడు. మేరీ సూదిలో దారం గుచ్చి యిచ్చాక, కుట్టుపనికి ఉపక్రమించాడు. చుట్ట వెలిగించి, జాన్ మరాయి కుట్టడం ప్రారంభించాడు. మేరీ అతన్ని ఒక కంట కనిపెడుతూనేవుంది. ఇటూఅటూ వెళ్తునప్పుడు చిరు నవ్వులో అతన్ని పలకరిస్తూనే వుంది.

రోజిక్ పాలీ గురించి ఆలోచిస్తున్నాడు. తను నిన్న జబ్బుపడి వుండకపోతే, పాలీది ఎటువంటి కమనీయ హృదయమో, తనకి తెలిసేది కాదుకదా! ఈ కాలపుపిల్లల హృదయాలు అతి మృదువైనవి. పైచూపుల్నిబట్టి వారి అంతర్యం తెలుసుకోలేం. పాలీ మధుర హృదయంగల అమ్మాయి. స్త్రీహృదయంలో ఉంటే మాధుర్యం ఉంటుంది; లేకపోతే లేదు. ఆ మాధుర్యం వున్నదీ లేనిదీ మొహం చూసి కొంతవరకూ చెప్పవచ్చు.

కాసేపు సూదీ దారంతో కుట్టాక, మళ్ళీ గుండెల్లో నొప్పిలా వచ్చింది; నిన్నటి నొప్పిలాగానే ప్రారంభమైంది. చుట్ట కిందపెట్టి, ఒక్కసారి కిటికీవూచలు పట్టుకు నుంచుంటే తగ్గుతుందేమో అని ప్రయత్నం చేశాడు. కాని, లాభం లేకపోయింది. పోనీ, పక్కదగ్గిరికి వెళ్ళి పడుకుందామనుకున్నాడు. సముద్రంలోని ఓడలా యిటూ అటూ వూగిసలాడుతూ తలుపుదగ్గిరికి అతి కష్టంమీదవచ్చి, అక్కడ కుప్పలా కూలిపోయాడు. మేరీవచ్చి చూసేవేళకి ఈలోకంలో లేడు.

* * *

రోజికీ చనిపోయేనాటికి డాక్టర్ ఊళ్ళోలేడు. ఊరునుంచి వచ్చాక మొదటి రెండుమూడు వారాలూ ఊపిరి సలపనంత పని. ఏరోజుకారోజు, రోజికీ కుటుంబం వారిని పరామర్శించి వద్దామనుకుంటూండేవాడు. ఇప్పటికే ఆలస్యమయిందనుకుంటూ వేసవికాలంలో ఒక వెన్నెల రాత్రివేళ, రోజికీ యింటివైపులకి బయలుదేరాడు.

స్మశానం ప్రాంతాలకి వచ్చేదాకా డాక్టర్ యితర విషయాలు అనేకం ఆలోచించుకుంటున్నాడు. అక్కడికి రాగానే, కారు యింజనుఆపి, ఆ వెన్నెలచూస్తూ అలానే వుండిపోయాడు. రోజికీ ఎక్కడ వున్నాడు? గ్రేవ్‌యార్డ్‌లోనా? లేదు, వెన్నెట్లో!

డాక్టర్‌లో ఏదో ఆత్మక్షోభ ప్రవేశించింది. సమస్త ప్రకృతీ చైతన్యవంతంగా కనిపించింది. మనకి అర్థం గాక

పోవచ్చుగాని, ప్రతి కదలికకీ వెనక ఏవో కొన్ని ఉద్దేశాలు ఉన్నాయి. రోజికీ పొలంలోని మవింగ్ మిషన్ (mowing machine) అక్కడ పడివుంది; మధ్యాహ్నం దానితో పిల్లలు పంటకోయించి ఉంటారు. పశువులూ, గుర్రాలూ అక్కడ కనిపిస్తూనే వున్నాయి. ఆ మధ్యాహ్నమే కొయ్య బడినపొలం, ప్రశాంత నిశీధసమయాన వింతపరిమళం వెద జల్లుతోంది. ధవళకాంతి గడ్డినికూడా తళతళలాడిస్తోంది. నీలాకాశం పూర్ణచంద్రుడితో ప్రకాశిస్తోంది.

ఈ గ్రేవ్ యార్డ్ కూడా చాలా అందంగా వుందే! - అనిపించింది డాక్టర్ కి. పట్నవాసాలలోని సమాధి స్థలాలకీ దీనికీ ఎంత తేడా! అక్కడి సమాధిస్థలాలు చనిపోయినవారి కోసమని నిర్మింపబడ్డ పట్నాల్లా వుంటాయి. కాని, యిది అలాటిది కాదు. చైతన్య ప్రకృతిలో ఒకభాగం. పసరిక పక్కమీద దుప్పటిలావుంది. పైన ఆకాశం, పక్కన పంట పొలాలు; రోడ్డుమీద గుర్రాల డెక్కల చప్పుడు. ఇరుగు పొరుగూ పట్నంవెళ్ళినా, పట్నంనుంచి వచ్చినా ఈ దార మ్మటే నడుస్తారు.

రోజికీది పరిపూర్ణమైన వినిర్మల జీవితంగా కనపడింది డాక్టర్ కి. మహాపట్నాలను తన కాయకష్టంతో నిలబెట్టే కర్షకప్రభువు, సజీవ ప్రకృతిలో హాయిగా నిద్రపోతున్నాడా అనిపించిందతనికి.

✦

# సముద్రం

## స్టీఫెన్ క్రేన్

## (1871 - 1900)

ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్ అను పేరిట స్టీఫెన్ క్రేన్, అమెరికను సివిల్ వార్ గురించి రాసిన గ్రంథం, గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించింది. మహాయుద్ధాల్ని ఎంతో చక్కగా వర్ణించిన ఈ రచయిత, తన నిజజీవితంలో ఆఖరుకి ఒక్క కొట్లాటకూడా చూసి ఎరగడు.

స్టీఫెన్ క్రేన్ న్యూజెర్సీ రాష్ట్రంలోని న్యూ ఆర్క్‌లో జన్మించాడు. అనారోగ్యంతోటీ, అపజయాలతోటీ జీవిత యాత్ర సాగించాడు. 'పడవ' కథ ఒక రకంగా మానవ జీవితాన్ని ప్రతిబింబిస్తుంది.

*

# సముద్రం

ఆకాశం కనిపించడంలేదు. తలఎత్తి చూడామనుకుంటే, కెరటంమీద కెరటంవచ్చి పడుతోంది. నల్లటి కెరటాలమీద తెల్లటి నురగలు. అన్నివైపులనుంచీ కెరటాలు మీది మీది కొచ్చి, చూపు ఆననివ్వడంలేదు. నురగలు కక్కే ఆకెరటాలు చేస్తున్న అల్లరి చెప్పతరంకాదు.

వంటమనిషి పడవకి అడుగున చతికిలబడి, తనని సముద్రంనుంచి వేరుచేస్తున్న ఆరు అంగుళాలఎత్తుని వెర్రిగా చూస్తున్నాడు. కండ పుష్టిగల జబ్బలమీదికి షర్టు చేతులు మడుచుకు, వంగి, నీళ్లు తోడెయ్యడం మొదలెట్టాడు. "మునిగిపోయేటట్టు వున్నాం, మునిగిపోయేటట్టు వున్నాం," అని మాటిమాటికీ అనేవాడు. అంటూ తూర్పుదిశకి చూసేవాడు.

నూనె అబ్బాయి (ఆయిలర్), పడవకివున్న రెండు తెడ్లలో ఒకతెడ్డుతో, చాకచక్యంగా పడవని నడుపుతున్నాడు. ఒక్కొక్కసారి పడవ వెనకనుంచి మునిగిపోతున్నట్టు తోచేది.

విలేఖరి రెండవతెడ్డువేస్తూ, కెరటాలు పరిశీలిస్తూ,

తనక్కడ ఎందుకువున్నానా అని క్షణక్షణానికీ ఆశ్చర్య పోతూండేవాడు.

కంపెనీ దివాలాతీస్తే, సైన్యం ఓడిపోతే, ఓడ మునిగిపోతే కలుగుతుందే అటువంటి వైరాగ్యంతో - కెప్టెన్ పడవముందు భాగాన పడివున్నాడు. ఎంతటి ధైర్యవంతులకి సాహసవంతులకికూడా ఒక్కొక్కప్పుడు ధృతి చెడుతుంది. అటువంటి తాత్కాలిక మనస్తాపంతో పడివున్నాడు - బాగా దెబ్బలు తగిలిన కెప్టెన్. కెప్టెన్ అన్నవాడు ఒక్కరోజు కెప్టెన్ చేసినా, పది సంవత్సరాలు కెప్టెన్ చేసినా, అతని మనసు ఓడకి అంకితమైపోయివుంటుంది. అందరు ప్రాణులతో వున్న తనఓడని, జలదేవత రౌద్రజిహ్వాలతో కబళించడం, నిస్సహాయంగా చూసిన కెప్టెన్, వెయ్యిసూదులు తనను గుచ్చుకుంటున్నట్టు బాధపడటంలో ఆశ్చర్యమేముంది?

"బిల్లీ, కాస్త దక్షిణంగా పట్టించు," అన్నాడు కెప్టెన్.

"ఇంకా స్త దక్షిణమా?"

పడవ కిందికీ మీదుకీ, యిటుపక్కకీ అటుపక్కకీ, యిష్టమొచ్చినట్టు గంతులేస్తోంది. ఎత్తయిన ముళ్లకంచెని దాటబోయే గుర్రంలా, ఒక్కొక్క కెరటంతో ఎగిరెగిరి పడుతూండేది ఆపడవ. నీటిగోడలతో పరాచికమాడుతూ,

నురగలతో నాట్యం చేస్తూండేది. నీటిగోడ చివరనుంచి కిందికి దభాలున పడటం, మళ్లీగోడపైకి ఎగబాకటం, నురుగులతో సరసం – యిదంతా పడవలోవున్న నలుగురికీ, తాము మృత్యువుతో దోబూచులాడుతున్నామా, అన్నట్టుగాఉంది.

ఇటువంటి సముద్ర ప్రయాణంలోవున్న మహా ప్రమాదమేమిటంటే, చచ్చిచెడి ఒక కెరటాన్ని జయించామని అనుకోగానే, మరొక కెరటం ప్రత్యక్షమవుతుంది. మొదటి కెరటం ఎంత ఉపద్రవమయినదో, రెండోదికూడా అంత ఉపద్రవంగానే కనిపిస్తుంది. పది అడుగుల పొడువున్న డింగీ, ఆ ఉపద్రవాలని ఎదుర్కోడమంటే మాటలుకాదు. ఒక్కొక్క కెరటం అభిషేకించే నీటితుంపరతో, పడవలోవున్న మనుషుల మొఖాలు అగుపించేవికాదు. ఈ ఒక్క కెరటం తరువాత, బతికి బయటపడతామని అనుకోడానికి వీల్లేదు. నాలుగయిదు పిల్లకెరటాలు, ఆపైన పెద్దకెరటం. ఆపెద్ద కెరటాన్ని జయించి, కాస్త వూపిరి పీల్చుకోగానే మరొక పెద్దకెరటం. ఆ కెరటాల శీవిలో ఆ సముద్ర సంగీతంలో ఒక భయంకర సౌందర్యం వుంది.

ఆ ఫేనకాంతిలో మనుషుల మొహాలు మరీధవళంగా ఉన్నాయి. ఒకరికళ్లు మరొకరికళ్ళని వింతవింత అర్థాలతో పలకరిస్తున్నాయి. బయటనుంచి అది చూడగలిగివుంటే, ఎంత అద్భుతమైన దృశ్యమో చెప్పలేము. ప్రాణాలకోసం

పోరాడుతున్న బోటులోని మనుషులకి అటువంటి ఓపిక లేదు; వారి మనసు యితరత్రా లగ్నమైవుంది.

సముద్రం, నల్లదనంనుంచి తృణమణి కాంతులుగల ముదురు ఆకుపచ్చలోకి మారడంతో, మంచు కరుగుతున్న మాదిరిగా నురగలు కనిపించడంతో, రాత్రినుంచి పగలు లోకి వచ్చామని తెలుసుకున్నారు వాళ్లు. సూర్యబింబం ఆకాశమండలంలో దర్శనమిచ్చింది. సూర్యోదయమవడం వాళ్ళకి తెలియదు, అది వాళ్ళకి కనిపించలేదు. తమ మీది కొచ్చి విరుచుకుపడే కెరటాలరంగులు మారడంతో తెల్ల వారింది కాబోలు అనుకున్నారు వాళ్లు.

జీవరక్షక శిబిరానికీ (a life saving station), కాందిశీక వసతి గృహానికీ (a house of refuge) ఉండే తేడాగురించి, సగం సగం మాటలలో, వంటలతనూ, విలే ఖరీ కాసేపు వాదించుకున్నారు.

"మస్కిటో ఇన్ లెట్ లైట్ కి ఉత్తరంగా ఒక కాంది శీక వసతిగృహం వుంది," అన్నాడు వంటమనిషి. "వాళ్లు మనని చూడగానే తమ బోటులోవచ్చి మనని రక్షిస్తారు," అనికూడా అన్నాడు.

"ఎవరు మనని చూడగానే?" అని ఎదురు ప్రశ్న వేశాడు విలేఖరి.

"అక్కడి నౌకాసిబ్బంది"

"కాందిశీక గృహంలో నౌకాసిబ్బంది వుండరు. పడవప్రమాదానికి గురిఅయినవాళ్లకి బట్టలిచ్చి, తిండిపెట్టే స్థలాలివి. అక్కడ నావికులు వుండరు."

"ఆ – ఉండకేం! ఉంటారు."

"ఉండరని చెప్పడంలే!" అన్నాడు విలేఖరి.

"ఏమయితేనేం మన మక్కడికి యింకా చేరుకో లేదుగా!" అన్నాడు పడవ వెనకభాగాన కూచున్న నూనె అబ్బాయి (ఆయిలర్).

"మస్కిటో ఇన్‌లెట్ లైట్‌లో వున్నది కాందిశీక వసతిగృహం కాదనుకుంటాను – అది జీవరక్షక శిబిరమేనని జ్ఞాపకం," అన్నాడు వంటమనిషి.

"మనమింకా అంతదాకా రాలేదుగా!" అన్నాడు చుక్కానిదగ్గిరవున్న ఆయిలర్.

* * *

తాటి ప్రమాణానవుండే కెరటం మీదికిఎక్కి, అంత ఎత్తునుంచి కిందికి జారుతున్నప్పుడు రివ్వుమని వీచేగాలికి, పడవలోవున్న నలుగురూ ప్రాణాలు వుగ్గబట్టుకు కూచునే వారు. సముద్రతరంగాలు వారిముందు విలయనృత్యం ప్రద ర్శించి, వింతకాంతులతో వారిని దద్దరింపజేసేవి.

"తీరానికి మనం దగ్గరసా ఉన్నాం - ఈ గాలివాటం అలానేవుంది," అన్నాడు వంటమనిషి.

"రైటే!" అన్నాడు విలేఖరి.

తెడ్డువేస్తున్న ఆయిలర్ అవునని తలవూపాడు.

పడవ ముందుభాగాన, గాయాలతో పడివున్న కెప్టెన్ హాస్యవిషాదరసాలు మిళితమైన కంఠంతో - ఓహో, అలాగా! - అన్నాడు.

కెప్టెన్ అలా అనేటప్పటికి, ముగ్గురూ కిమ్మనకుండా వూరుకుండిపోయారు. నిముషనిముషానికీ మహాప్రమాదం వెంటాడుతూండగా రానున్న మంచిగురించి ఆశ వెలిబుచ్చడం, చిన్నతనపు చేష్టగానూ, తెలివిహీనతగానూ కనిపించింది. ఎటువంటి ప్రమాదంలో తామున్నారో వారికి తెలుసు. మాటలతో ఉపశాంతి పడవలసిన వేళకాదు - ఆ విశ్వాసాన్ని మనసులో వుంచుకోవాలిగాని. అందుకని, కెప్టెన్ అలా అనేటప్పటికి, ఏ ఒక్కరూ పెదవి మెదపలేదు.

కాసేపయాక, పిల్లల్ని సముదాయిస్తున్నట్టు, "మనం తీరానికి ఎందుకుచేరుకోము - చేరుకుంటాం," అన్నాడు కెప్టెన్.

కాని, ఆకంఠధోరణి ముగ్గురు మనుషుల్నీ ఆలోచింపజేసింది. "గాలి యిలావుంటే చేరుకుంటాం," అన్నాడు ఆయిలర్.

వంటమనిషి పడవలోని నీళ్లుతోడి బయటపోస్తూ, "సర్ఫ్‌లో (surf - ఆటూపోటూ) యిరుక్కోకపోతే చేరు కుంటాం," అన్నాడు.

నీటిపక్షులు ఎగరడం మొదలెట్టాయి. సముద్రజలాల మీద తివాసీపరిచినట్టు కూచునేవి ఆనీటిపక్షులు. గుంపులు గుంపులుగా, నిక్షేపంగా కూచున్న ఆపక్షుల్నిచూసి, డింగీలోవాళ్లు అసూయపడ్డమాట నిజమే! వెయ్యిమైళ్లదూరాన వున్న కోడిపెట్టలు నేలమీద ఎంతహాయిగా ఉంటాయో, ఈ పక్షులు నీటిమీద అంతహాయిగా ఉన్నాయి. కెరటాలతోదొర్లే నీటినాచుమీద, మహాసంతోషంగా కూచున్నాయి.

నల్లటి చింతగింజల్లావున్న కళ్ళతో ఆనీటిపక్షులు, పడవలోవున్న వాళ్లదగ్గిర దగ్గిరికివచ్చేవి - వికారమైన చూపులతో, పరిశీలనగాచూస్తూ, దగ్గిరదగ్గిరికొచ్చేవి. మనుషులు వాటిని తరిమేవారు. అంతకీ, ఒకపక్షి కెప్టెన్ తలమీద వాలాలని వచ్చింది. ఘట్టిగా అదిలించేవేళకి, పడవకి అడ్డంగా ఎగిరి పారిపోయింది. పడవచుట్టూ వలయాకారంగా ప్రదక్షిణ చేస్తుందేమో అనుకున్నారుగాని చెయ్యలేదు. ఇటుకాసేపూ, అటుకాసేపూ తిరిగి మళ్ళీ కెప్టెన్ దగ్గిరికివచ్చింది. చింతగింజల్లాటి దానికళ్ళు కెప్టెన్ శిరసుమీదనే ఉన్నాయి.

"వెధవపక్షి" అని విసుక్కున్నాడు ఆయిలర్.

వంటమనిషీ విలేఖరీ దానిని చెడామడా తిట్టారు.

పడవకివున్న తాడుతో, శక్తికొద్దీ ఆనీటిపక్షిని ఒక దెబ్బవేదామని అనిపించింది కెప్టెన్‌కి – కాని తను అటువంటి పనిచేస్తే, పడవకాస్తా బాలెన్సుతప్పి, బుడుంగున మునిగి పోతుందేమోనని ఊరుకున్నాడు. అంచేత, వొట్టి చేతుల తోటే దానిని నెమ్మది నెమ్మదిగా తరమడం మొదలెట్టాడు. కొంచెంసేపటికి ప్రాణాలు విసుగెత్తాయేమో, దానిదారిన అదిపోయింది.

ఆనీటిపక్షి రంగస్థలంనుంచి తప్పుకున్నాక వారిమనసు కొద్దిగా స్తిమితపడింది. అసలే మహాప్రమాదంలోఉన్నారు. గోరుచుట్టుమీద రోకలిపోటులా దుశ్శకునం తోపించే నీటి పక్షి ఒకటా వారిప్రాణాలకి!

ఆయిలరూ, విలేఖరీ తెడ్లువేస్తున్నారు. అలా తెడ్లు వేస్తూనేఉన్నారు. ఒకేసీటులో కూచుని యిద్దరూ చెరొక తెడ్డూవేస్తున్నారు. ఆయిలర్ అప్పుడు రెండుతెడ్లూ తీసు కున్నాడు. తర్వాత, ఆయిలర్ దగ్గరనుంచి రెండుతెడ్లూ తీసు కున్నాడు విలేఖరి. తర్వాత మళ్లీ ఆయిలర్. తర్వాత మళ్లీ విలేఖరి. ఇద్దరూ అలా తెడ్లువేస్తున్నారు – వేస్తూనేవున్నారు.

తెడ్లువేయడంకంటె శ్రమఅయినది, స్థలాలుమారడం. పడుం వాల్చేందుకు, ఒకపక్కనుంచి మరొకపక్కకు రావడ

మంటే, తీగెమీద నడవడంకంటె నేర్పరితనంతో కూడుకున్న వ్యవహారం. తీగెమీద నడుస్తున్న మనిషి కిందపడితే, కాళ్లువిరుగుతాయి. కాని, యిక్కడ ఏమాత్రం వొడుదుడుకు వచ్చినా, డింగీ బుడుంగున మునిగి, నలుగురి ప్రాణాలూ నైవేద్యం పుచ్చుకుంటుంది. తెడ్లు వేసేఅతనూ, విశ్రాంతి తీసుకుంటున్నతనూ స్థలాలు మారుతున్నప్పుడు, మిగతా యిద్దరూ పెద్దకెరటం ఎంతదూరాన ఉందో గమనిస్తూండే వారు. సరిగ్గా ఏక్షణాన స్థలాలు మారాలో కెప్టెన్ ఆర్డరు చేస్తూండేవాడు.

తివాసీల్లా పరచబడివున్న సముద్రపునాచు, నేల యేమో అనుభ్రమ కల్పిస్తూ చిన్నచిన్న ద్వీపాలలా ఉండేది. వారు ప్రయాణంచేస్తున్నారు. ప్రయాణం చేస్తున్నంత వరకూ నిజమేగాని, ఏదిక్కుగా ప్రయాణం చేస్తున్నారో వారికి తెలియదు. కదులుతున్నట్టే ఉంది – కాని కదులుతున్నారో లేదో! తీరంవైపుకే చేరుకుంటున్నామని ఒకరికొకరు ధైర్యం చెప్పుకున్నారు.

పడవముందుభాగంలో పడివున్న కెప్టెన్‌కి, మస్కిటో ఇన్‌లెట్‌లోని లైట్‌హౌజ్ కనిపించింది – పడవ ఒకసారి మరీపైకి వెళ్లినప్పుడు. ఆతర్వాత వంటమనిషి తనకికూడా కనిపించిందన్నాడు. విలేఖరి తెడ్లదగ్గిర ఉన్నాడు. అతనికి

కూడా లైట్‌హావుజ్ చూడాలని ఉంది; కాని, మెడ వెనక్కి తిప్పిచూస్తేగాని అతనికి కనిపించదు. లైట్‌హావుజ్ కంటె ముఖ్యమయినవి కెరటాలు. వాటిఉధృతం కొద్దిగా తగ్గేదాకా, మెడ వెనక్కి తిప్పిచూడటానికి వీలులేక పోయింది విలేఖరికి. పెద్దకెరటం కాస్తదూరాన ఉన్నప్పుడు చటుక్కున పడమటి దిక్కుగా తలతిప్పాడు విలేఖరి.

"కనిపించిందా?" అని అడిగాడు విలేఖరి.

"లేదు. ఏమీ కనిపించడం లేదు," అన్నాడు విలేఖరి నెమ్మదిగా.

కెప్టెన్ వేలుతో చూపిస్తూ, "అదిగో, అటువైపు. మళ్ళీ ఒకసారి చూడు," అన్నాడు.

నీటిగోడలాంటి కెరటం మీదికి డింగీ ఈసారి ఎక్కినప్పుడు, మళ్లీ చూశాడు విలేఖరి. గుండుసూది మొనలా తెల్లటిదేదో దూరాన అగుపడింది. అలిసినకళ్లకి అది లైట్‌హావుజ్‌లాగానే కనిపిస్తోంది.

"మనమక్కడికి చేరుకోగలమా, కెప్టెన్?"

"గాలి ఈ ప్రకారంవుండి, మనం బురదలో కూరుకుపోకపోతే, తప్పకుండా చేరుకుంటాం."

కెరటాలు పడవని తమ యిష్టమొచ్చినట్టు, కిందికీ పైకీ విసురుతున్నాయి. సముద్రపునాచు కనపడక పోయే

టప్పటికి, తాము ముందుకే జరుగుతున్నాం కదా! అనుకున్నారు పడవలోనివారు. మహాసముద్రం ఈ చిన్న పడవ మీద కత్తికట్టిందా అన్నట్టు వుంది పరిస్థితి. ఒక్కొక్క కెరటంవచ్చి, పడవని నీటితో ముంచెత్తేది.

"నీరు తోడెయ్, కుక్," అనేవాడు కెప్టెన్ అతి ప్రశాంతంగా.

"ఓ - అలాగే!" అంటూండేవాడు వంటమనిషి ధైర్యోత్సాహాలతో.

* * *

పడవలోవున్న నలుగురూ అక్షరాలా సోదరులే. ఆ విషయం వారు పైకిచెప్పుకోలేదు. కాని, నలుగురికీ తాము సోదరులమని అంతర్యంలో తెలుసు. కెప్టెన్, ఆయిలర్, వంటవాడు, కరస్పాండెంట్ (విలేఖరి) - ఈ నలుగురినీ ఒకటిగా పెనవేసిన బాంధవ్యం మనకి మామూలుగా తెలిసే బాంధవ్యాలకంటె తీవ్రమయినది. గాయపడ్డ కెప్టెన్ పడవ ముందుభాగాన, మంచినీటి కూజాకి చేరగిలపడుకొని, సన్నని గంభీరకంఠంతో ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. ఈ డింగీలో వున్న మిగతా ముగ్గుర్నీ తన కనుసన్నల ప్రకారం నడిపిస్తున్నాడు. ఉపద్రవాన్ని ఎదుర్కోవాలనే ఐక్య లక్ష్యమే గాకుండా, నలుగురిమధ్యా సాటిలేని మానవత్వం వెల్లివిరిసింది. హృదయాలలోనుంచి వచ్చింది ఆ సోదరభావం.

తోటిమానవులను ఉదాసీనంగా చూసే విలేఖరిలోకూడా హృదయ పరివర్తన వచ్చింది. తాము సోదరులమని వారు చెప్పుకోలేదు ; ఆ విషయం పైకి అననుకూడాలేదు.

"మనకి ఒక తెరచాప ఉంటే బావుండేది" అన్నాడు కెప్టెన్. "ఒక తెడ్డుకి చివరగా నా ఓవర్‌కోటు వేలాడదీస్తే, తెరచాపలా పనిచేస్తుంది. మీలో యిద్దరికి కాస్త విశ్రాంతి దొరుకుతుంది."

కుక్, విలేఖరీ తెరకొయ్య పట్టుకొని, ఓవర్‌కోటు నిల బెట్టారు. ఆయిలర్ చుక్కాని పడుతున్నాడు. పడవ చర చరా నడవసాగింది. ఎటొచ్చీ, సముద్రజలం పడవలోకి రాకుండా, అప్పుడప్పుడు తెడ్డువేస్తూ పడవ నడుపుతున్నాడు ఆయిలర్.

గుండుసూదిమొనలా కనిపించిన లైట్‌హావుజ్, పెద్దది కాసాగింది. మునుపటికి మల్లేకాక, స్పష్టంగా బూడిద రంగులో కనిపిస్తోంది. తెడ్డుదగ్గరవున్న మనిషి, అది చూడ టానికిగాను ఎన్నిసార్లో తలతిప్పేవాడు.

అలా కెరటాల పైకి లేస్తూ దిగుతూ, చిట్టచివరకి నేలని చూశారు పడవలో ఉన్నవాళ్ళు. లైట్‌హావుజ్ ఆకాశంవైపుకివున్న పొడుగుపాటి నీడలాగానూ, నేల సము ద్రంలోపడే నల్లటినీడలాగానూ కనిపించాయి. కాయితం కంటె పల్చగాఉంది ఆనీడ.

నౌకా ప్రమాదాలు ఎప్పుడూ చెప్పిజరగవు. ప్రమాదం జరిగినప్పుడు ఏవిథంగా మసులుకోవాలో ప్రయాణీకు లందరికి శిక్షణ యివ్వడం సాధ్యంగానిపని. డింగీలోని నలుగురికీ రెండురాత్రుళ్లూ రెండుపొగళ్లూ నిద్రలేదు. అదంతా డింగీలో కాలుపెట్టడానికి పూర్వపువిషయం. అంటే, మునిగిపోయే ఓడలోనుంచి ఈపడవలోకి వస్తున్నప్పటిమాట.

ఆయిలర్ కీ, విలేఖరికీ – యిద్దరికీ తెడ్డువేయడమంత్నే తెలీదు. మతివున్న మనుషులు బోట్ రేసెస్ ఎందుకు నిర్వహిస్తారా? – అనిపించింది విలేఖరికి. అది వినోదం ఎందుకవుతుంది – కఠినసరకంగాని! వెన్నునరాలనీ చేతికండరాలనీ పీక్కుతినే యిటువంటిబాధని, వినోదంగా ఎలాభావించ గలుగుతారో కొందరు మనుషులు! బోట్ రేసెస్ గురించిన తన అభిప్రాయం ఆయిలర్ కి చెప్పేటప్పటికి, అతను సానుభూతిపూర్వకంగా చిరునవ్వు నవ్వాడు.

"ఇంక శ్రమపడకండి. ఉన్నకొద్దిపాటిశక్తీ మిగుల్చుకోండి. తీరం చేరుకునేందుకు మనం ఈదవలసి వుంటుంది. అంచేత, కాస్త స్తిమితపడండి," అన్నాడు కెప్టెన్.

సముద్రంలోనుంచి, నెమ్మది నెమ్మదిగా, నేలమొలిచినట్లయింది. నల్లగీతఅల్లా, నల్లగీతా తెల్లగీతాగా మారాయి – అంటే చెట్లు, యిసక అన్నమాట. తీరంమీదవున్న ఒక యిల్లుకూడా కనపడుతోంది – అన్నాడు కెప్టెన్.

"అదే జీవరక్షక శిబిరం అయివుంటుంది. వాళ్లు మనని చూసివుంటారు. ఈపాటికి వస్తూండాలి," అన్నాడు కుక్.

వెనకభాగాన ఎత్తుగా అవుపిస్తోంది లైట్‌హావుజ్.

"లైట్‌హావుజ్ కీపర్ డ్యూటీలోవుంటే, మనని ఈ పాటికిచూసి, జీవరక్షక శిబిరంవారికి తెలియబరిచివుంటాడు," అన్నాడు కెప్టెన్.

"నౌకా ప్రమాదంగురించి వారికి తెలిసినట్టులేదు. తెలిసివుంటే ఈపాటికి మనని వెతికేందుకు వచ్చివుండరూ?" అన్నాడు ఆయిలర్.

అతి సుందరమైననేల స్పష్టంగా కనపడ్డది. మళ్లీగాలి వీచింది – ఈసారి ఉత్తర దక్షిణాలుగా! ఏదో కొత్తధ్వని పడవలోని వాళ్లకి వినిపించింది. కెరటాలు తీరాన్ని తాకే టప్పుడు చేసే శబ్దమది.

"ఈవిధంగా అయితే మనం లైట్‌హావుజ్ చేరుకోము. కొద్దిగా ఉత్తరానికి పట్టించు," అన్నాడు కెప్టెన్.

"ఉత్తరదిశకా?" అన్నాడు ఆయిలర్.

పడవ గాలికివాలుగా తిరిగింది. తెడ్డుదగ్గరవున్నతను తప్ప మిగతావాళ్లు, తీరం క్షణక్షణానికీ విస్తృతమవడం చూస్తున్నారు. నేల పెద్దగా కనిపిస్తున్నకొద్దీ, వారి మనసు

ల్లోని భయాందోళనలు వీడిపోసాగాయి. పడవని పదిలంగా నేర్పుగా పట్టిస్తే, ఇంకోగంటలో తీరం చేరుకోగలరు.

వెన్నముకలువంచి, పడవ బాలెన్సు నిలబెట్టడం, వారికి బాగా అలవడింది. సర్కసు మనుషులు అడవిగుర్రం మీద స్వారీచేస్తున్నట్టువుంది వారి స్తితి. విలేఖరి పూర్తిగా తడిసిపోయాడు. ఆమాటకొస్తే ఎవరు తడవలేదుగనక ? విలేఖరి కోటుజేబులో ఎనిమిది చుట్టలువున్నాయి. నాలుగుతడిసి పోయాయి ; నాలుగు శుభ్రంగాఉన్నాయి. కొంచెంసేపు పరిశోధనచేసి మూడు అగ్గిపుల్లలు సంపాయించారు. నలుగురూ నాలుగుచుట్టలూ శీవిగాముట్టించి, ఘట్టిగా దమ్ముపీల్చారు. బతికి బయటపడతాంకదాఅని, వారికళ్లు తళతళ మెరిశాయి. నలుగురూ కాసిని కాసిని మంచినీళ్లుతాగి, హుషారుగా కబుర్లు ప్రారంభించారు.

* * * *

ఆ జీవరక్షక శిబిరంలో మనుషులులేరా ఏమిటి ? ఒక్కడూ కనపడటంలేదు,'' అన్నాడు కెప్టెన్.

" మనని యింతవరకూ వాళ్లు చూడకపోవడం తమాషాగానే ఉంది !'' అని అందిచ్చాడు కుక్.

విశాలమైన సముద్రతీరం, పడవలోని మనుషులకి, స్పష్టంగా కనపడుతోంది. నేలమీద చెట్లూచేమలూ దట్టంగా ఉన్నాయి. తీరాన్ని స్పృశించే అలలశబ్దం స్పష్టంగా విన

పడనే వినపడుతోంది. నేలమీదనున్న ఒకచిన్న యిల్లూ కూడా కనిపిస్తోంది. లైట్‌హౌజ్ యిప్పుడు తమకి దక్షిణంగా ఉంది.

ఆటుపోట్లూ, గాలీ, కెరటాలూ డింగీని ఉత్తరదిశకి తోసేస్తున్నాయి. "లైట్‌హౌజ్ వాళ్లు మనని చూడనే చూడరేమిటి?" అనుకున్నారు పడవలోని మనుషులు.

సముద్రగర్జన (surf's roar) సన్నగా వినపడుతోంది. సన్నగా వున్నప్పటికీ ఉధృతంలో తక్కువ దేమీ కాదు. పడవ దడదడ కొట్టుకుంటోంది.

"బురదలో కూరుకుపోతాం - జాగ్రత్తపడాలి," అన్నారు అందరూ.

ఇప్పుడు, కొంత సత్యం చెప్పవలసిఉంది. జీవరక్షక శిబిరం ఆచుట్టుపట్ల యిరవైమైళ్ళ దూరంలో ఎక్కడా లేదు. ఆసంగతి డింగీలోవున్న మనుషులకి తెలియక, లైట్‌హౌజ్ వాళ్లని నోటికొచ్చినట్లు అంటున్నారు.

"వాళ్లకి కళ్లు లేవు కాబోలు మనని చూసేందుకు!"

తిట్టవలసినతిట్లు అన్నీ అయిపోయాక కెప్టెన్ అన్నాడు. "మనం తీరంచేరుకునేందుకు ప్రయత్నించక తప్పదు. ఇలానే వుంటే, పడవ బురదలో కూరుకుపోవడం ఖాయం. మన వొంట్లో కొద్దిగా శక్తి మిగిలివున్నప్పుడే, ఈదడం ప్రారంభిస్తే సరి!"

తెడ్లదగ్గిరవున్న ఆయిలర్ పడవని తిన్నగా ఒడ్డువైపు పట్టించాడు. అందరికీ నరాలు బిగుసుకుపోయాయి ఒక్క-సారిగా. మళ్లీకొద్దిసేపు ఆలోచించారు.

"మనందరం తీరంచేరుకో లేకపోతే," అని ప్రారంభించాడు కెప్టెన్. "మనందరం తీరంచేరుకోలేకపోతే, ఎవరెవరు ఎలా ఆఖరయారో, మిగిలినవారు చెప్పాలి."

మరణవార్తలు తెలియజేయ వలసిన యడ్రస్‌లు జాగర్త చేసుకున్నారు. వాళ్ళ కెందుకనో సముద్రంమీాద, సృష్టిమీాద చెడ్డ కసిగావుంది. కోపజ్వాలలతో వాళ్లు దహించుకుపోతోంది. పైకి అనలేదుగాని, వారి మనోభావన యిలా ఉంది. "నేను చనిపోవలసివుంటే, నేను చనిపోవడం తప్పనిసరి అయితే, నేను చనిపోవాలని రాసివుంటే, తెల్లటి యిసకా పచ్చటిచెట్లూ కళ్ళకి కనపడేదాకా నన్నెందుకు బతకనివ్వాలి ఈ జలదేవత? వెన్నముద్దలాటి జీవితాన్ని సముద్రంలోకి గిరవాటు వెయ్యడానికి ఎందుకీ రాక్షస పన్నాగం? విధి ఎంత చెడ్డదైనా, ఆ చెడ్డతనంలో యింత క్రూరత్వం ఉందా? ముసిలి అవ్వకిమల్లే తను ఏం చేస్తుందో తనకే తెలియదా ఈవిధికి? తను నన్ను ముంచెయ్య దలుచుకుంటే, యింత శ్రమపెట్టడంకూడా దేనికి - మొదట్లోనే ముంచెయ్యవచ్చుగా? చూస్తున్నకొద్దీ యిదొక వెర్రిమొర్రి చేష్టలా కనపడుతోంది. తనకి నన్ను ముంచెయ్యాలని

లేదా ? చూస్తూ చూస్తూ ముంచదలచుకోలేదా ? మరేం చెయ్యదల్చుకుంది ? ఇంత శ్రమపడ్డానే – అని కనికరమా ? పోనీ, ఒక్కసారి ముంచెయ్యకూడదా – ఈ బాధనించి విముక్తి అయినా కలుగుతుంది !''

పిడికిలి బిగించి, మేఘాలవైపుచూస్తూ, విధిని తిట్టా లనిపించింది వాళ్ళకి.

ఇంతలో పెద్ద పెద్ద కెరటాలు వారిమీదకి దాడిచేశాయి. అవి ఆచిన్న పడవని నురగలతో నింపేసేవి. అంతేగాక, ఆ కెరటాలు తీరానివి అయివుండటంచేత, పడవని దభీదభీమని కొడుతున్నాయి. వాటిని దాటుకుంటూ, ఈ పడవ ప్రయాణం చెయ్యగలగడం కల్ల. తీరం యింకా చాలాదూరాన ఉంది.

"ఈ ప్రకారం అయితే, యింకో మూడు నిముషాలలో పడవ పగిలిపోతుంది. తీరం చాలా దూరంగావుంది – మనం అంతమేర ఈదలేం. పడవని మళ్ళీ సముద్రంవైపుగా పట్టించనా ?'' అని అడిగాడు ఆయిలర్ కెప్టెన్‌ని.

"అలాగే కానియ్," అన్నాడు కెప్టెన్.

ఎంతో నిపుణతతో ఆయిలర్ పడవని, మళ్ళీ తీర ప్రదేశంనుంచి సముద్రంలోకి పట్టుకొచ్చాడు. అందరి ముఖాల్లోకీ చెప్పలేనంత విచారం వచ్చింది.

"తీరానవున్న వాళ్ళలో ఎవరో ఒకరు మననిచూసి వుండాలి ఈ పాటికి!" అన్నారు నలుగురిలో ఒకరు.

నీటిపక్షులు గుంపులుగుంపులుగా తూర్పు దిక్కుకి పోతున్నాయి. ఆగ్నేయంగా ఏదో ఎర్రటిపొగ కనపడింది – పెద్దయిల్లు ఒకటి తగలబడు తున్నట్టుగా.

"జీవరక్షక శిబిరంవారు ఏమయినట్టు?"

"వారు మనని చూడనేలేదా!"

"మనమిక్కడికి కాలక్షేపంకోసం, చేపలు పట్టేం దుకు, వచ్చామనుకున్నారేమో!"

నెమ్మది నెమ్మదిగా పొద్దు వాలుతోంది. సముద్రపు పోటు మారుతోంది. సముద్రపుపోటు వారిని దక్షిణానికీ గాలీకెరటం వారిని ఉత్తరానికీ వూగిస లాడిస్తున్నాయి. ఎక్కడో దూరానవుంది తీరరేఖ. ఆ తీరరేఖమీాద బొట్లు బొట్లుగా వున్నాయి – బహుశా, ఆ బొట్లు యిళ్లు అయి వుంటాయి.

స్థలాలు మారేటప్పుడు దేహం యావత్తూ ఎంతో పీక్కుపోయేది. పడవలో వెన్ను వాల్చినప్పుడు, చల్లటి సముద్రపునీరు మనిషిని పూర్తిగా తడిపేసేది. శిరసుకీ సముద్రజలానికీ మధ్య రెండు అంగుళాల స్థలంకూడా ఉండేదికాదు. పడవలోకివచ్చిన ప్రతి కెరటం మొహంమీాద

నీరు చిందుతూండేది. ఇవేమీ బాధించేవికాదు; బోటు కాస్త వొరుగుతే, తిన్నగా పరలోక యాత్రే. ఆ సంగతి కూడా బాధించేదికాదు. అదొక మెత్తటి పరుపులా హాయిగా నిద్రపోతూండేవాడు విశ్రాంతి తీసుకుంటున్న మనిషి.

"అదిగో, సముద్రతీరాన ఒకమనిషి కనిపిస్తున్నాడు."

"ఎక్కడ?"

"అదిగో - అక్కడ, అక్కడే!"

"అవును సుమా - బీచమ్మట నడుస్తున్నాడు."

"ఇప్పుడు నిలబడ్డాడు. మనవంక చూస్తున్నాడు."

"చెయ్యి వూపుతున్నాడు."

"హమ్మయ్య - కనిపించాడు."

"ఇంక ఫరవాలేదు, మనకి యింక ఫరవాలేదు. ఒక అరగంటలో మనకోసం బోటువస్తుంది."

"అదిగో - అతను ముందుకి నడుస్తున్నాడు. పరిగెడుతున్నాడు. అదిగో - ఆ యింటికి వెళ్తున్నాడు."

బీచి సముద్రానికి దిగువగా కనపడుతోంది. ఆ నల్లటి ఆకారం ఏమిటో, కళ్ళు పొడుచుకున్నా కనిపించడం లేదు. ఒక కర్రముక్క కొట్టుకురావడంచూసి, అటువైపుగా పడవని తీసుకువెళ్ళమన్నాడు కెప్టెన్. కాస్త పొడుగాటి ఆకర్ర

ముక్క అందుకొని, బోటులో పడివున్న ఒక తువ్వాలు ఆ కర్రముక్కకి తగిలించి, దాన్ని జండాగాచేసి, తాము ఆపదలో వున్నామని తెలియపర్చేందుకుగాను యిటూ అటూ వూపడం మొదలెట్టాడు. తెడ్డువేసేమనిషి తల వెనక్కి తిప్పడానికి వీల్లేదు - తిప్పితే బోటు బుడుంగు మంటుంది. అందుకని ప్రశ్నలువేసి సంగతేమిటో తెలుసు కుంటూండేవాడు.

"ఏమి చేస్తున్నా డతనక్కడ?"

"అలాగే నిలబడ్డాడు. మనవంక చూస్తున్నాడను కుంటా...మళ్ళీ ఆ యింటివైపుగా వెళ్తున్నాడు ... మళ్ళీ ఆగిపోయాడు ఎంచేతనో!"

"మనవంక చెయ్యి వూపుతున్నాడా?"

"లేదు. అదిగో, అదిగో - చెయ్యి వూపుతున్నాడు."

"చూడు, చూడు - మరొకతను వస్తున్నాడు."

"పరుగెత్తుకుంటూ వస్తున్నాడు."

"ఇద్దరూ ఒకేచోట వున్నారా? మాట్లాడుకుంటు న్నారు కాబోలు!"

"అతను పరిగెత్తుకుంటూ రాలేదు; బైసికల్ మీద వచ్చాడు. బైసికల్ మీద వచ్చినతనూ, వెనకటి అతనూ - యిద్దరూ చేతులు వూపుతున్నారు. చూడు, చూడు."

"మరింకేదో వస్తోంది బీచిమీదికి."

"ఏమిటా దిక్కుమాలినది?"

"బోటులా ఉంది."

"సంశయమెందుకు – బోటే!"

"కాదు – అది చక్రాలమీద ఉంది."

"అయితే, అది లైఫ్‌బోటు అయివుండాలి. సముద్ర తీరం దగ్గరికి దానిని మోటారులారీలో తీసుకొనివస్తూవుండి వుంటారు."

"అది లైఫ్ బోటుకాదు – మోటారుబస్."

"కాదు – లైఫ్‌బోటు."

"లైఫ్‌బోటు కాదంటూంటే! మోటారు బస్ అని స్పష్టంగా కనపడటం లేదూ? పెద్దపెద్ద హోటల్స్‌లో ఉంటుందే అలాటి బస్."

"అవునవును, నువ్వన్నది నిజమే. మోటారు బస్సే. బస్సుఎందుకు యిప్పుడు? బహుశా లైఫ్ – క్రు(life - crew)ని ఎక్కించుకు వచ్చేందుకేమో!"

"అవును – అదీ నిజమే అయివుండవచ్చు. చూడు – పల్లజండా వూపుతున్నాడు అతనెవరో! బస్ ఫుట్‌బోర్డు మీద నుంచున్నాడు. మరోయిద్దరు వచ్చారు. అందరూ కలిసి ఏదో మాట్లాడుకుంటున్నట్టున్నారు. జండావూపిన

మనిషివంక చూడు. అతను జండా మనని ఉద్దేశించి వూపి నట్టులేదే!"

"అది జండా అనుకోను. అతని కోటు. నిస్సందే హంగా అతనికోటే!"

"అవును - అతనికోటే. కోటుతీసి భుజంమీద వేసు కున్నాడు."

"అసలు ఈ చుట్టుపట్ల జీవరక్షక శిబిరం అంటూ లేనేలేదనుకుంటాను. ఆ బస్ ఏదో వింటర్ హోటల్ది (winter resort hotel) అయి ఉంటుంది. మనం యెలా మునిగిపోతామో చూపించేందుకు, బోర్డర్స్ని బీచిమీదికి పట్టుకొచ్చివుంటారు వాళ్ళు."

"కోటు వేసుకున్న ఆ వెర్రివెధవ ఏమిటంటాడు? ఏమిటో సూచనలు చేస్తున్నాడు - అర్థంగానివి!"

"మనని ఉత్తరదిశగా పొమ్మని కాబోలు వాడి ఉద్దేశం అక్కడ జీవరక్షక శిబిరం ఏమయినా ఉందేమో!"

"ఆ...అదికాదు. మనం చేపలు పట్టేందుకు వచ్చా మనుకుంటున్నాడు. ఉత్తరంగా పోతే మంచిచేపలు దొరుకు తాయనేమో వాడిభావన."

"ఆ సంజ్ఞలు అర్థమయితే బావుణ్ణు. ఏమంటాడో తెలియకుండా వుంది."

“ ఏమీలా అనడు. మనతో ఆటలాడుతున్నాడు.”

“ తీరంలోకి చొచ్చుకురమ్మనమనో, సముద్రంలోకి పొమ్మనమనో, ఉత్తరంగా వెళ్ళమనో, దక్షిణంగా వెళ్ళ మనో లేక ఎక్కడో అక్కడపడి చావండనో - స్పష్టంగా ఏడవరాదూ ఆ చెప్పేదేమిటో - కొయ్యలా నిలబడి, ఆ కోటు గిరగిరా తిప్పకపోతే! వొట్టి గాడిదలా ఉన్నాడే!”

“ ఇంకా చాలామంది వస్తున్నారు.”

“ అవును - మనుషులు మూగుతున్నారు. అదిగో, బోటు అదిగో!”

“ ఎక్కడ? నువ్వుచూపించేచోట బోటులేందే!”

“ వాడు యింకా తనకోటు గిరగిరా తిప్పుతూనే ఉన్నాడు.”

“ తనుకోటు తిప్పడంచూసి, మనం సంతోషిస్తున్నా మనుకుంటున్నాడా వెధవ. ఇంక మానెయ్యవచ్చునే!”

“ మనని ఉత్తరంగా పొమ్మనమని కాబోలు వాడి ఉద్దేశం. అక్కడేదయినా జీవరక్షక శిబిరం ఉందేమో!”

“ ఇంతసేపు తిప్పాకకూడా వాడికి చేతులు నెప్పులు పెట్టడంలేదే!”

“ చూదాం - ఎంతసేపుతిప్పుతాడో అలా! మనకి కనిపించినప్పట్నుంచీ, చేతులు పడిపోయేటట్టు తిప్పుతూనే

వున్నాడు - ఇడియట్! లైఫ్‌బోటుపుచ్చుకు ఆ మనుషులు ఎందుకురారు? పోనీ, చేపలుపట్టేపడవ అయినా ఫరవా లేదుగా! ఏదో ఒకటి చెయ్యరెంచేత?"

"కొద్దిసేపట్లో అంతా సానుకూలమవుతుంది."

"మనని చూశారుగా - బోటుతీసుకొని వస్తారు!"

దిగువగా కనపడుతున్న నేలమీదనుంచి ఆకాశం లోకి, పసుపుపచ్చనికాంతి ధూళిలేచింది. సముద్రంమీది నీడలు పొడవయాయి. గాలులు మరీచల్లగా అయాయి. పడవలో వాళ్లకి వొణుకుపుట్టించే చల్లదనం.

"మనం యిలా తర్జనభర్జనలు చేస్తూంటే, రాత్రంతా ఎముకలుకొరికేసే ఈచలిలో బాధపడాల్సి ఉంటుంది," అన్నారు ఒకరు.

"ఆ...రాత్రంతా యిక్కడ ఎందుకువుంటాం? మీకు ఆ భయం అక్కర్లేదు. వాళ్ళు మననిచూశారు - వెతు క్కుంటూరాకపోరు."

సంధ్యాధూళితో కప్పడిపోతోందితీరం. కోటు గిర గిరాతిప్పినమనిషీ, మోటార్ బస్, మనుషులగుంపూ ఆసం ధ్యలో కలిసిపోతున్నాయి. సముద్ర కెరటాలని ఉడుకుమోతు తనంతో చూస్తున్నారు నలుగురు ప్రయాణీకులూ.

"కోటువూపినవాణ్ణిపట్టుకు వుతకాలనిపిస్తోంది."

"అతనేం చేశాడు, పాపం?"

"ఏం చేయడమేమిటి? మనమిక్కడ చస్తూంటే నిక్షేపరాయుడిలా కోటువూపుతూ, తమాషా చూస్తున్నట్టు నుంచున్నాడు."

ఈలోగా ఆయిలర్ తెడ్లువేస్తున్నాడు; ఆయిలర్ తర్వాత విలేఖరి వేస్తున్నాడు; విలేఖరి తర్వాత మళ్ళీ ఆయిలర్. యంత్రాలమాదిరి తెడ్డువేస్తున్నారు. దక్షిణ మండలంలోని లైట్ హౌస్ మాయమై, దానిస్థానే, మిణుకుమిణుకుమనే ఒకనక్షత్రం, సముద్రంలోనుంచి ఉదయించింది. పశ్చిమాన కనపడ్డ ఎరుపుధవుళి తగ్గిపోతోంది. తూర్పునంతా చీకటి అయిపోయింది. నేల ఎక్కడా కనపడటంలేదు. నేల అంటూ ఒకటి ఉందనేసంగతి, తీరాన్ని తాకే కెరటాలుచేసే ప్రత్యేక ధ్వనివల్ల మాత్రమే తెలుస్తోంది.

"నేను చనిపోవలసివుంటే, నేను చనిపోవడం తప్పనిసరి అయితే, నేను చనిపోవాలని రాసివుంటే, తెల్లటియిసకా పచ్చటిచెట్లూ కళ్లకి కనపడేదాకా నన్నెందుకు బతకనివ్వాలి ఈజలదేవత? వెన్నముద్దలాటి జీవితాన్ని సముద్రంలోకి గిరవాటువెయ్యడానికి ఎందుకీ రాతుసపన్నాగం?"

ధైర్యం చెడనికెప్టెన్, నీటికూజామీద ఆనుకుంటూ, తెడ్లువేసే అతనితో అన్నాడు. "తలపై కివుండనీ – తలపైకివుండనీ."

"పడవతల యింకొద్దిగాపైకా ?" అని అలిసిపోయిన నీరసకంఠాలు పల్కాయి.

ప్రశాంతసమయం. తెడ్డువేసే అతనుతప్ప మిగతా వాళ్ళు, వొళ్ళు తెలియకుండా పడుకుని ఉన్నారు పడవలో. మీదిమీదికివచ్చే కెరటాలతో ధర్మయుద్ధం సాగించడమే తెడ్డువేసే అతను చేయగలపని.

అడ్డుకర్రమీాద తలఆన్చి, ముక్కుకిసూటిగావున్న నీట్లోకిచూస్తూ, "మీకు ఏఏకూరలు యిష్టం ?" అని అడిగాడు కుక్.

"తిండీ కూరలూసంగతి యిప్పుడు జ్ఞాపకం చెయ్యకు," అన్నారు ఆయిలరూ, విలేఖరీ ఒకేసారి.

"నేను యిప్పుడు కమ్మటిభోజన పదార్థాలగురించి తలుచుకుంటున్నాను," అన్నాడు కుక్.

నట్టనడిసంద్రాన, యిటువంటి పడవలో, నాలుగు జాముల రాత్రిగడపడమంటే మాటలుకాదు. అదికాళరాత్రే- ఎంతకీ అవదు. పూర్తిగా చీకటిపడ్డాక, దక్షిణాన్నుంచి ఒక వెల్తురూ, ఉత్తరాన్నుంచి ఒక వెల్తురూ అగుపడ్డాయి. దక్షిణాన్నుంచివస్తున్న వెల్తురు బంగారువన్నెతో సముద్రంలోనుంచి వస్తున్నట్టుగాఉంది. ఉత్తరాన్నుంచి వస్తున్న వెల్తురు నీలపుకాంతితో తీరరేఖనుంచి వస్తున్నట్టుగాఉంది. ఆ రెండే

వారి ఆశాజ్యోతులు. ఆ రెండూ తప్పిస్తే మిగిలేవి సముద్ర కెరటాలే!

పడవ వెనకభాగంలో యిద్దరు కాళ్ళు చాపుకుపడుకున్నారు. పడవేమో చాలాచిన్నది; యింక చలా, చెప్ప తరంకాదు; చలికితోడు సముద్రజలంతో అభిషేకం. ఆ నీళ్ళలో తడుస్తూ, ఆ చలికి కొంకర్లుపోతూ ముక్కుతూ మూలుగుతూ వాళ్ళు తెలియకుండా, నిద్దర పోయేవారు నిద్దర పోతున్నారు.

ఒకరు నిద్దరపోతే మరొకరు తెడ్డువేయాలని ఆయిలరూ విలేఖరీ ఏర్పాటుచేసుకున్నారు. సత్తువవున్నంతసేపూ ఒకతనువేయడం, ఆపైన రెండోవాళ్ళని లేపడం - అదీప్లాను.

సముద్రపు ఉధృతం తగ్గినట్టుగాఉంది. కెరటాలు నురగలు కక్కుతూ మీదికి రావడంలేదు. తెడ్డువేసే అతను చూడవలసిన దేమిటంటే, పడవ మునిగిపోకుండా కాపాడటం, నీరు తిన్నగా పడవలోకివచ్చి పడకుండా చూసుకోవడం. ఇవి నురగలులేని నల్లకెరటాలు కాబట్టి దూరంనుంచి కన పడటంలేదు.

వెచ్చగావుండేందుకు లైఫ్‌బెల్ట్ చుట్టుకుని నీళ్లుఎత్తి పారిపోస్తున్నాడు కుక్. చలికి మధ్యమధ్య పళ్లుకటకటలాడిస్తున్నాడు, కాసేపు నీళ్ళు పారపొయ్యడం, నిస్త్రాణవచ్చి కళ్లు

ముయ్యడం, మళ్ళీ నీళ్ళు పారపొయ్యడం, మళ్ళీ నిస్త్రాణవచ్చి కళ్ళు ముయ్యడం – అదీ కుక్ కార్యక్రమం.

తెడ్లువేస్తున్న విలేఖరి, కాళ్ళదగ్గరపడి నిద్దరపోతున్న ఆయిలర్‌నీ, కుక్‌నీ చూశాడు. ఇద్దరిమొహాలూ పీక్కుపోయి వున్నాయి; ఆ కారాలు చూడటానికి భయంకరంగా ఉన్నాయి.

ఇంతలో ఒక పెద్దకెరటంవచ్చి పడవలో పడింది. లైఫ్‌బెల్ట్ చుట్టుకునివున్న కుక్ ఆ నీటితోబాటు తేల్తాడు అనుకున్నాడు విలేఖరి. కాని అలాటిదేమీ జరగలేదు. కుక్ యథాప్రకారంగా నిద్దరపోతూనే వున్నాడు. ఆపాద మస్తకం నీళ్ళతో మునిగిపోయి వుండటంవల్ల ఆయిలర్ ఒక సారి కళ్లుతెరచి, చుట్టూతాచూసి, మళ్లీ కళ్లు మూసుకున్నాడు.

కెప్టెన్‌కికూడా కునుకుపట్టింది. ఈ మహాసముద్రం మీద జాగ్రదావస్థలో ఉన్నది తనొక్కడేగదా – అనుకున్నాడు విలేఖరి. తరంగపంక్తులమీద నుంచి వచ్చే గాలి, రోదన స్వరంతో విలపించనారంభించింది.

నీలపుమంటలో, పనసకత్తిలాటిది ఒకటి పడవ పక్కగా దూసుకుపోయింది.

ఆ తర్వాత నిశ్శబ్దం. విలేఖరి వెర్రిమొహంవేసి సముద్రంవైపు చూశాడు.

మళ్ళీ, అటువంటి నీలపుమంటే, వెనకవైపునుంచి వచ్చింది. అది మంటకాదు – తళుకు. ఆ ఎగురుతున్నది "భాస్వర" చేప.

విలేఖరి ఆందోళనపడ్డాడు. కెప్టెన్ వంకచూశాడు. కెప్టెనేమో నిద్దర్లో వున్నాడు. మిగతా యిద్దరు మిత్రులు వాళ్లూ పై తెలియకుండా నిద్దరపోతున్నారు. కొద్దిగా ఎడం వైపుగావంగి, సముద్రాన్ని శాపనార్థాలు పెట్టాడు.

కాని, "భాస్వర" చేప పడవని వొదిలిపెడితేనా! ఇటూఅటూ దూసుకుంటూ పోయేది. దానిది అద్భుతమైన వేగం. అదిచేసే శబ్దం భీతావహమయింది.

అటువంటి భాస్వరచేప సమక్షంలో తను ఒక్కడూ వుండటం విలేఖరికి భయంభయంగానేవుంది. ఏ ఒక్కరన్నా లేస్తే బావుండుననుకుంటున్నాడు. కాని ఎవరూ లేవరే! కెప్టెన్ నీటికూజాని ఆనుకుని నిద్రపోతున్నాడు; మిగతా యిద్దరూ తనకాళ్ళదగ్గిర పడుకుని నిద్దర్లు పోతున్నారు.

* * *

"నేను చనిపోవలసివుంటే, నేను చనిపోవడం తప్పనిసరి అయితే, నేను చనిపోవాలని రాసివుంటే, తెల్లటి ఇసుకా పచ్చటినేలా కళ్ళకి కనపడేదాకా నన్నెందుకు బతకనివ్వాలి ఈ జలదేవత?"

ఇంతకష్టపడ్డాక, తనని ఆవిధంగా ముంచెయ్యడం జల

దేవతకి ధర్మకాదు. వాళ్లు ముక్కలుముక్కలు అయేటట్లు కష్టపడ్డాడు. ఇంత యమయాతన అనుభవింపజేసి, ఆఖరున ముంచెయ్యడం దురన్యాయం. ఓడతో బాటు మిగతా వాళ్లు హాయిగా చచ్చిపోయారు. తమకెందుకీ బాధ?

ప్రకృతి తనను ఒకలెక్కలోకి తీసుకోదనీ, తను చచ్చినా బతికినా ప్రకృతిదృష్టిలో ఒక్కటేననీ మానవుడు అనుకోడు. పాపం – ఆ ఆలోచనని భరించలేక, దేవుడిగుడి మీదికి యిటుకలు విసురుతాడు. యిటుకలతో కట్టిన గుడి మీదికి యిటుకరాళ్లు విసురుతాడు – అమాయకుడు! ప్రకృతికి మానవుడు వుంటే ఎంత, పోతే ఎంత! నిజానికి మానవుడు తననితాను ప్రేమించుకుంటున్నాడు – దేవుణ్ణీకాదు, ప్రకృతినీ కాదు.

డింగీలో మనుషులు యిలాటి విషయాలు గురించి మాట్లాడుకోవడంలేదు. కాని వారివారి మనః పరిపక్వాన్ని బట్టి ఆలోచనలు వస్తున్నాయి. వాటిని వారు నిశ్శబ్దంలో నెమరువేస్తున్నారు. అలసటతప్ప వారిమొహంలో మరేమీ కనపడటంలేదు. పడవ నడపడం గురించిన విషయలే వారు పైకి, మాటలలో, చెప్పుకుంటున్నారు.

ఏదో చిన్నప్పుడు చదువుకున్న పద్యం జ్ఞాపకం వచ్చింది విలేఖరికి. ఆల్జియర్స్‌లో చనిపోయిన సోల్జర్ గురించిన పద్యం అది :

కెప్టెన్ చెబుతున్నాడు. పడవని సముద్రానికి ఎదురుగ్గా నెల బెట్టి, తెడ్లువేస్తున్న యిద్దరికీ కొంచెం విశ్రాంతి యిద్దామను కున్నాడు కెప్టెన్. కుక్ పడవ కాపాడుతున్నాడు.

"తీరంవైపుకి కొట్టుకొస్తున్నట్టు వున్నాం. మళ్లీ దీన్ని సముద్రంలోకి పట్టుకుపోవాలి," అన్నాడు కుక్.

*  *  *

విలేఖరి కళ్లు తెరిచేవేళకి సముద్రమూ, ఆకాశమూ గోధుమవన్నెలో వున్నాయి. ఆ తర్వాత, సముద్రంమీద కుంకుమ, బంగారం పరచినట్టయింది. జీవకోటికి ఆప్తబంధు వయిన సూర్యుడుదయించాడు ఆపైన. ఆకాశం నీలపు రంగులోకి వచ్చింది. తరంగశిఖలని సూర్యకిరణాలు గిలిగింతలు పెడుతున్నాయి.

దూరంగా వొడ్డున యిసుకదిబ్బలూ, నల్లనికుటీరాలూ, పొడుగాటి తెల్లని గాలిమరా కనిపిస్తున్నాయి. మనుషులు గానీ, కుక్కలుగానీ, బైస్కిళ్లుగానీ ఏమీ లేవు బీచిమీద. నిర్మానుష్యమైన గ్రామమా - అన్నట్టుగా ఉందది.

నలుగురూ తీరంవంక పరిశీలనగా చూశారు. ఒక రితో ఒకరుకూడబలుక్కున్నారు. "మనకి ఏసహాయం వచ్చే ట్టు కనపడకపోతే, ఈ కొంచెందూరం ఈదేసి, వొడ్డుచేరు కోవడం మంచిది. మనకివున్న ఈకొద్దిపాటిశక్తీ హరించుకు పోకపూర్వమే, తీరం చేరుకోవడం మంచిది," అన్నాడు కెప్టెన్.

మిగతావాళ్లుకూడా ఆప్రకారమే అనుకున్నారు.

బోటు బీచివైపుగా నడుస్తోంది. అంతపెద్ద గాలిమర తమకి కనపడుతోంది; కాని ఏఒక్కరూ తమని చూడటం లేదుకదా - అనుకున్నాడు విలేఖరి. ఈ అల్పజీవులు ఏమయితే నాకేం - అన్నట్టుగాఉంది ఆగోపురం. గోపురం ప్రకృతికి నమూనాగా కనిపించింది విలేఖరికి. ప్రకృతి క్రూర మయినదీకాదు, మేలుచేసేదీకాదు; కుట్రలూనేర్వదు, వివే కమూనేర్వదు. ఉదాసీనత దానిలక్షణం. చీమల్లాటి ఈ మనుషులు, ఏమయిపోతే దానికేం!

ఇటు సూర్యబింబం, అటుతీరరేఖా ప్రాణాలమీద తీపిని యినుమడింపజేశాయి. నలుగురూ కడపటి ప్రయత్నా నికి ఉద్యుక్తులవుతున్నారు.

"ఇంకమనం బురదలో కూరుకుపోతాం. పడవ బుర దలో కూరుకుపోయిందని స్పష్టం అవగానే నీటిలోకి దూకే సెయ్యండి," అన్నాడుకెప్టెన్.

ఎంతదూరం ఈదగలమా - అనిప్రతిఒక్కరూ తమలో తాము లెఖ్ఖచూసుకుంటున్నారు. విలేఖరికి ఆవిధంగాలెఖ్ఖ చూసుకోవాలనికూడా అనిపించలేదు.. నరాలూ, కండరాలూ అలిసిపోయివున్నాయి; మెదడుకి ఆలోచించేపాటి ఓపిక కూడాలేదు. అందరూ ఈదగలిగితే తను ఈదలేకపోవడం సిగ్గుచేటు - అనుకున్నాడు విలేఖరి. అంతే!

మాటల్లేవు, భయాల్లేవు, ఆందోళన అంతకంటె లేదు. తీరంవంక మట్టుకు చూస్తున్నారు నలుగురూ.

"దూకేటప్పుడు పడవలో యిరుక్కుపోకుండా జాగ్రత్తగా దూకండి," అని ముందుగానే వారించాడు కెప్టెన్.

"స్టెడీ" అన్నాడు కెప్టెన్. నలుగురూ నీటిలోకి దూకేశారు. పడవకి అడుగునపడివున్న లైఫ్‌బెల్ట్ ముక్కనొకదాన్ని, నడుముకి చుట్టుకున్నాడు విలేఖరి.

జనవరినెల అవడంవల్ల సముద్రజలం ఎంతచల్లగా ఉందో చెప్పతరంకాదు. విలేఖరి ప్రాణానికి బోటులోవున్నప్పుడే కాస్తవెచ్చగా ఉంది. ఈచలి తనకి కన్నీళ్లు తెప్పిస్తోంది. పైకితేలేవేళకి, అతనికి తరంగనాదం గురించినస్పృహ తప్ప మరొకటిలేదు. కొద్దిక్షణాలయాక తన మిత్రులని చూశాడు. ఆయిలర్ ముందువున్నాడు - అతనువేగంగా ఈదగలడు. విలేఖరికి ఎడమవైపుగా తేలుతున్నాడు కుక్. కొంచెం వెనకగాఉన్నాడు - తలకిందులైనబోటుని ఒక చేతితోపట్టుకు ఈదుతున్న కెప్టెన్.

సముద్రంలో ఎంతకదలికో, తీరంమీద అంత నిశ్చలతగదా - అనుకున్నాడు విలేఖరి. అంతాబాగానేఉంది. నెమ్మదిగా ప్రయాణంచేయాలిగాని తొందరపడి లాభంలేదు.

కెరటాలు ఉక్కిరిబిక్కిరి చేసేచోటు చేరుకున్నాడు

విలేఖరి. అవుక్కిరిబిక్కిరి స్తలాన్ని ఎంతకీ దాటలేకుండా ఉన్నాడు. రంగస్థలంమీద దృశ్యంలా ఉందిబీచి. తీరంమీద వున్న ప్రతిదీ స్పష్టంగా కనపడుతోంది - కాని, తనుముందుకి సాగలేకుండా ఉన్నాడు.

ఎడమవైపునుంచి కుక్ ముందుకి వెళ్లిపోయాడు.

"తెడ్డుమీద వెల్లగిత్తులా పడుకుని ఈదు," అంటున్నాడు కెప్టెన్.

కుక్ అతను చెప్పినట్టుచేస్తూ, దోనెపడవలా ముందుకి సాగిపోతున్నాడు.

ఒకచేతితో పడవ వెనకభాగాన్నిపట్టుకు, కెప్టెన్ కూడా ముందుకి సాగిపోతున్నాడు. గాయపడ్డ కెప్టెన్‌కి అంత శక్తి ఎక్కడనుంచివచ్చిందా అని ఆశ్చర్యబోయాడు విలేఖరి.

ఆయిలర్, కుక్, కెప్టెన్ - తీరానికి దగ్గరసా వెళ్లిపోయారు. వారి వెనక నీటికూజా గంతులేసుకుంటూపోతోంది.

విలేఖరి ప్రవాహంలో యిరుక్కుపోయాడు. అందునుంచి బయటపడలేకుండా ఉన్నాడు. తెల్లటియిసకా, పచ్చటిచెట్లూ, వెచ్చటకుటీరాలూ చిత్తరువులోని దృశ్యంలా అగుపడుతున్నాయి అతనికి.

"నేను మునిగిపోతున్నానా? మునిగిపోతానా? మునిగిపోవడమే! అంతే - మునిగిపోవడమే" - అని తనలోతను అనుకున్నాడు.

కాసేపు అయాక, మరొక కొత్తకెరటంవచ్చి, అతన్ని ఆప్రవాహంనుంచి మరొకదిక్కుగా తోసేసింది. దాంతో అతను, నెమ్మదినెమ్మదిగా తీరం చేరుకోసాగాడు. "పడవ దగ్గిరకిరా, పడవదగ్గిరకిరా" - అనిపేరుపెట్టి అరుస్తున్నాడు కెప్టెన్.

బోటుదగ్గిరకి చేరుకోవాలనే పెనుగులాటలో, అతనికి ఈశ్రమకంటె చావేమేలు - అనిపించింది. జలదేవతతో ఎందుకీపోరాటం? - అనుకున్నాడు. పోరాటం విరమించడంలోనే తెరిపేమో! బాధలేకుండా చావగలరా?

తీరంమీద ఒకమనిషి పరిగెట్టడం కనిపించింది. అతను కోటూ, పంట్లాం, షర్టూ గబగబా వొదిలేస్తున్నాడు.

" పడవదగ్గిరకిరా " అంటున్నాడు కెప్టెన్.

"ఆల్‌రైట్, కెప్టెన్," అంటూ విలేఖరి అటువైపుగా ఈదుకుంటూవస్తున్నాడు. కెప్టెన్ అడుక్కి వెళ్లిపోయి, పడవని వొదిలెయ్యడం చూశాడు. ఇంతలో ఒక కెరటం విలేఖరిని ఒక్కవిసురు విసిరింది. ఆవిసురుతో అతను, పడవవున్న చోటుకంటె ముందుకి, వచ్చిపడ్డాడు.

విలేఖరి మొలలోతునీళ్లలో ఉన్నాడు. కాని మొలలోతునీళ్లలో నుంచునేపాటి ఓపికకూడాలేదు. వెనకనుంచి వచ్చిన కెరటం ముందుకి కొడుతోంది; తీరంనుంచి లోనికి పోయే నీరు వెనక్కిలాగుతోంది.

బీచిమీదవున్న మనిషి గబగబా నీళ్లలోకి పరిగెత్తుకు రావడం చూశాడు విలేఖరి. అతను కుక్‌ని బీచిమీదికి లాక్కొచ్చిపడేసి, కెప్టెన్ దగ్గిరికి వెళ్లబోయేటప్పటికి, కెప్టెన్ విలేఖరి దగ్గిరికి వెళ్ళమని సంజ్ఞ చేశాడు. విలేఖరి దగ్గిరకొచ్చి, అతను చెయ్యిపుచ్చుకు, ఘట్టిగాలాగాడు.

వొడ్డుదగ్గిరకొచ్చి, యిసకమీద బోర్లాపడిపోయాడు ఆయిలర్. శిరసు యిసకమీదా, దేహంనీటిలోనూ. ఒక్కొక్క కెరటమేవచ్చి అతన్ని తడుపుతోంది.

విలేఖరికి మిగతావిషయాలు తెలియవు. నేలమీదికి రాగానే కుప్పకూలినట్టుపడిపోయాడు. దేహంలో అణువణువు యిసుకరేణువుల్ని స్పృశించింది. ఇంటికప్పుమీదనుంచి కింద పడ్డట్టుగాఉంది. కాని ఆపడటం ఎంతో హాయిఅనిపించింది.

బీచినిండా మనుషులు, దుప్పట్లు, బట్టలు, ఫ్లాస్కులు, కాఫీలు, మందులు - కావలసినన్ని. సముద్రంనుంచివచ్చిన వారికి భూదేవి సుస్వాగతమిచ్చింది. ఆయిలర్ ఒక్కడికి మాత్రం ఆ స్వాగతం మరోకవిధంగా జరిగింది.

చంద్రకాంతిలో సముద్ర కెరటాలుపాడే సంగీతానికి అర్థం చెబుతామంటారు ఈ మానవులు - తమకేదో మహా తెలిసినట్టుగా!

★

# కుమారి

## ట్రూమన్ కపోటి

(1924 -    )

అమెరికా దేశపు యువరచయితల్లో ఒకడు. 1948లో ట్రూమన్ కపోటి మొదటి నవల 'అదర్ వాయిసెస్, అదర్ రూమ్స్' పబ్లిష్ అయింది. ఆ నవల వెలువడ్డాక, తీవ్రవాదోపవాదాలు చెలరేగాయి.

మనని తరుముతూ వెంటాడే వ్యక్తుల్ని చిత్రించడంలో కపోటి నేర్పరి. ఆ చిత్రణలో కవితాశిల్పం కనిపిస్తుంది. ఆనందమయ స్వప్నసీమలోని విషాదపు ఛాయ వెలుపలికి తీస్తాడీ రచయిత. పట్టున పదేళ్లులేని బాబిట్ అనే అమ్మాయి కథ యిది.

# కుమారి

నిన్న సాయంత్రంవేళ ఆరుగంటల బస్సు కుమారి శాబిట్ మీదుగా వెళ్ళిపోయింది. ఆ అమ్మాయిగురించి ఏమి చెప్పాలో స్పష్టంగా తెలియడంలేదు ; కాని మాఊళ్ళోవాళ్లు మట్టుకు ఆపదేళ్లమ్మాయిని మర్చిపోలేరు.

సరిగ్గా ఏడాదిక్రితం బాబిట్, వాళ్ల అమ్మా ఆరుగంటలబస్సుమీదనే ఈ ఊరువచ్చారు. ఆ వేళ మాకజిన్ (దగ్గిర బంధువు) బిల్లీబాబ్ పుట్టినపండగ.

అదివేసంగి. ఒక్కచినుకుకూడా పడలేదు ఆవేసంగుల్లో. రోడ్డుమీద దుమ్ము చెప్పనక్కర్లేదు. ఒక్కొక్క కారు వెళ్లాకలేచేదుమ్ము, గంటసేపటిదాకా గాలిలో కనిపిస్తూండేది. ''ఈరోడ్డు మనవాళ్ళు తారురోడ్డుగా చేయించకపోతే, నేను సముద్రతీరంవైపుకి మకాం మార్చేస్తాను'' అనేది ఆంట్ ఎల్. ఆమె ఈవిషయం చాలా సంవత్సరాలబట్టి ప్రతివేసంగికీ అంటోంది.

ముందువాకిట్లో కూచుని పళ్లూ ఫలాలూ తింటూ, ఏదైనా వింతజరిగితే బావుణ్ణు - అనిపిల్లలు అనుకుంటూండగా, నిజంగానే వింతలాటిది జరిగింది. పసుపుపచ్చగౌను వేసుకు, చేతిలో ఒకగొడుగుపుచ్చుకు, రంగుల రామచిల

కలా డ్రెస్ చేసుకున్న పదేళ్ల అమ్మాయి కనపడింది. ఆ అమ్మాయి వెనక రెండు అట్టపెట్టెలూ, ఒక గ్రామఫోను పెట్టె పుచ్చుకు నడుస్తోంది వాళ్ల అమ్మ, పెద్దావిడబట్టలు బావుా లేవు, ఆవిడకళ్ళు ఏమిటో అర్థరహితంగా ఉన్నాయి.

పదేళ్లమ్మాయి గేటుదాకావచ్చి యిలా అడిగింది:

"క్షమించండి ఈయింట్లోని పెద్దవాళ్లతో మాట్లాడవచ్చా?" – ఆమెకంఠం మృదువుగా, నాజూకుగా, సినీమా తార కంఠధ్వనిలా ఉంది.

"నాపేరు మిస్ లిలీజేన్ బాబిట్ – టెన్నిసీరాష్ట్రానికి చెందిన మెమ్ఫిస్ నగరంలోని మిస్ బాబిట్ని," అని నదురూబెదురూలేకుండా చెప్పింది.

"నేనూ మా అమ్మ యిక్కడ ఒకవాటా తీసుకున్నాం – మిసెస్ సాయర్ యింట్లో. ఆ మిసెస్ సాయర్ యిల్లు ఎటువైపో దయవుంచి చూపిస్తారా?" అని అడిగింది కుమారి బాబిట్.

"అదిగో, మూడిళ్ళు అవతల ఆపాతమేడలేదూ – అదే!" అంది ఆంట్ఎల్.

తల్లితోకూడా మిసెస్ సాయర్ పాతమేడవైపుగా వెళ్లబోతూ ఈముక్కలు అంది: "మాఅమ్మకి కొద్దిగానత్తి. అంచేత, ఆమెతరఫునకూడా నేనే మాట్లాడుతున్నాను.

కుట్టుపనిలో మాఅమ్మ అఖండురాలు. మెమ్ఫిస్, టల్లాహాస్సి మొదలైన నగరాల్లోని పెదపెద్దవాళ్లందరూ, మాఅమ్మ చేతనే, తమబట్టలు కుట్టించుకుంటారు. నేనువేసుకున్న గౌను మీకు చాలాబావుందికదూ! ఈగౌను మాఅమ్మ, తనచేతు లతో తను, స్వయంగాకుట్టింది. ఇదంతా చేతికుట్టే -మిషన్ కుట్టు ఎక్కడాలేదు. మీరు ఎటువంటి నమూనాచూపించినా అది కుట్టెయ్యగలదు మాఅమ్మ. లేడీస్ హోమ్ జర్నల్ వారి 25 డాలర్ల ప్రయిజ్ ఈమధ్యనే మాఅమ్మకివచ్చింది. అల్లి కలూ, చేతికుట్లూ, ఎంబ్రాయిడరీ - అన్నీ వచ్చు మాఅమ్మకి. మీకు ఏవిధమైన కుట్టుపనులు కావలిసొచ్చినా, మాఅమ్మ దగ్గిరికిరావచ్చు. మీ బంధుమిత్రాదులకి మాగురించి చెబు తారుగా...థాంక్స్"

కోరా, మిగతా ఆడపిల్లలూ తామేదో చిన్నవాళ్ళు అయిపోయినట్టుగా బాధపడ్డారు. "నాపేరు మిస్ బాబిట్" అంటూ కుమారి బాబిట్ని, కోరా కాసేపు వెక్కిరించింది. నాబట్టలు అట్లాంటానుంచివస్తాయి, నాజోళ్ళు న్యూయార్కు నుంచి వస్తాయి, నేను పెట్టుకున్న ఉంగరం మెక్సికో సిటీ నుంచి వచ్చింది - తెలుసా? - అంటూ గర్వంగా తన గురించి చెప్పుకుంది.

తోటిబాలికని ఆక్షేపించకూడదని ఆంట్ఎల్ వారిం -చింది. కాని, అల్లరిపిల్లలు కొందరు వినలేదు. మిమ్మల్ని

మీామీా యిళ్ళకి పంపించేసి, మీా తలిదండ్రులతో చెబు తాను ఈ సంగతి – అని బెదిరించింది ఆంట్ ఎల్. ఇంతలో కుమారి బాబిట్ అటుపక్కగా వచ్చింది. అప్పటికప్పుడే పాతడ్రెస్ మార్చేసి, సరికొత్త డ్రెస్‌లోవుంది.

బిల్లీబాబ్, ప్రీచర్‌స్టార్ లాటి పెద్దపిల్లలు కుమారి బాబిట్ కనపడగానే గేటుదగ్గిరికి పరుగెత్తారు. కోరా మట్టుకు గొంతుసవరించుకు, కిందిపెదవి కొరుక్కుంటూ నిలబడింది. మిగతావాళ్లు మెట్లదగ్గిర నిలబడ్డారు. కుమారి బాబిట్ వాళ్ల ఉనికినే గమనించకుండా, సాయర్ ఆవరణని అంటిపెట్టుకువున్న తోటలోకి వెళ్లింది. చేతిలో గ్రామఫోను పెట్టె పుచ్చుకు మరీవెళ్లింది. అక్కడ గ్రామఫోనుకి కీయిచ్చి నృత్యవాయిద్యంగల రికార్డు పెట్టింది. చీకటి చీకటి పడుతోంది; మిణుగురుపురుగులు ఎగిరే సమయం; నీలం సీసాలో పాలుపోసినట్టు ఉందిలోకం; పక్షులు చెట్లకొమ్మల్లోకి దూరుతున్నాయి. చుట్టూ చీకటిలో కుమారి బాబిట్, తను ఒకర్తే, నిలబడింది. అలా కాసేపు నిలబడి నృత్యం ప్రారంభించింది. గ్రామఫోనుకి కీయివ్వడానికి మట్టుకే ఆగేది. అక్కడ వాయిద్యం ప్రారంభంకాగానే, యిక్కడ తను నృత్యం అందుకునేది. చంద్రోదయ మయింది ; రాత్రి భోజనాలయాయి; పిల్లలు ఎవరిదారిన వాళ్లు యిళ్ళకి వెళ్ళిపోయారు. కాని కుమారి బాబిట్ మట్టుకు, నృత్యంలో యింకా తన్మయురాలవుతూనే ఉంది.

ఆ తర్వాత కొన్నాళ్లపాటు మేము ఆమెని చూడ లేదు. ప్రీచర్ స్టార్ ప్రతిఉదయం మా యింటికొచ్చి, రాత్రి దాకా మాయింట్లోనే వుండిపోతూండేవాడు. ప్రీచర్ స్టార్ సన్నగా కడ్డీలా వుండేవాడు - అతనిది ఎర్రటిజుట్టు; వాళ్ళ అన్నదమ్ములూ అప్పచెల్లెళ్ళూకలిసి మొత్తం పదకొండుగురు. తోడబుట్టినవాళ్లకికూడా అతనంటే భయమే. కుటిలతకీ, కోపానికీ అతనికి పెట్టిందిపేరు. గడిచిన జులై నాలుగున అతను ఒక కుర్రవాణ్ణి ఎంత చావమోదాడంటే, ఆ కుర్ర వాణ్ణి పక్కపట్నంలోని హాస్పిటల్‌కి తీసుకెళ్లి పడేయవలసి వచ్చింది. ఒకసారి అతను గాడిద చెవికొరికి, కటకటసమిలి, ఆపైన వుమ్మేశాడు. ఇతరపిల్లల హోమ్‌వర్క్ పుస్తకాలు చింపెయ్యడంలో మొనగాడు. చిమ్మెటలు చొక్కాల్లో పడెయ్యడం, కారపుచేతులు కళ్ళకిరాయడం - యిటువంటి వాటిగురించి చెప్పనే అక్కర్లేదు. ఒకప్పుడు బిల్లీబాబ్‌కీ ప్రీచర్ స్టార్‌కీ బద్ధవైరం. కాని యిప్పుడు ప్రాణస్నేహితు లైపోయారు. ఇద్దరూ జంటగానేగాని, విడివిడిగా కనపడటం లేదు ఎక్కడా.

కుమారి బాబిట్ వున్న మేడ దిగువని నిలబడి, వీళ్లు ఎంతోబిగ్గరగా పాటలు పాడుతూండేవారు. ఆ పాటలు చుట్టుపక్కల వాళ్ళందరికీ వినిపించేవిగాని, కుమారి బాబిట్ ఏ ఒక్కనాడూ విన్నట్టుతోచదు. కనీసం, కిటికీ దగ్గరికివచ్చి అయినా, తొంగిచూసేదికాదు ఆ అమ్మాయి.

ఒకరోజు మిసెస్ సాయర్ ఒకకప్పు పంచదార బదులు అడగడానికివచ్చి, తమయింట్లో కొత్తగా ప్రవేశించిన వాళ్ళగురించి కథలూ గాథలూగా చెప్పింది...తండ్రి వొట్టి మోసగాడట, ఆ సంగతి కూతురే చెప్పిందట. అతనికి సిగ్గూ భిడియంలేదట. అయినప్పటికీ వీళ్ళనాన్నంత చక్కగా పాడగలిగేవాడు టెన్నిసీ మొత్తంమీద మరొకడు లేడట. అతను యిప్పుడు ఎక్కడ వున్నాడని అడిగిందట; జైలులో వున్నాడనీ, కబుర్లు తెలియడంలేదనీ చెప్పిందట ఆ అమ్మాయి...ఆతల్లి ఒక్కమాట మాట్లాడదట. మాటలు రావేమో, మనభాష తెలీదేమో అనిపిస్తుందట...వాళ్లు అన్నీ పచ్చిపచ్చివే తింటారు. పచ్చికోడిగుడ్లు, పచ్చిదుంపలు, పచ్చికూరలు - అన్నీ పచ్చివే (raw). మాంసం మాత్రం ముట్టరు. అదంతా ఆరోగ్యం అని చెబుతుందట ఆ అమ్మాయి. ఏమి ఆరోగ్యమో - మొన్న మంగళవారంనుంచీ ఆ అమ్మాయికి జ్వరం.

ఆ సాయంత్రమే గులాబీచెట్లకి నీళ్ళుపొయ్యడానికని వెళ్ళిన ఆంట్ ఎల్, గులాబీపువ్వులు ఎవరో దొంగిలించారని తెలుసుకుంది. ఆ గులాబిని తను ప్రత్యేకంగా తెప్పించింది. ఈ ఏడు ఫ్లవర్ షోకి వాటిని పంపాలనుకుంటోంది. ఎవరో దుండగీడులు తను కష్టపడి పెంచిన గులాబీలని అపహరించడం భరించలేక, తక్షణం షెరీఫ్ (గ్రామాధికారి)కి ఫోను

చేసింది. షెరీఫ్ వెంటనే వచ్చేశాడు. ఏమిటీ ఈ హడా వుడి అని, అందరూ తమతమ వీధివాకిళ్లలో నిలబడ్డారు. మొహాన రక్తపుచుక్కలేని మిసెస్ సాయర్ గబగబా పరుగెత్తికొచ్చి, "మీ బిల్లీ బాబ్ ఈగులాబీలని మాఇంట్లో యిచ్చి వెళ్లాడు - కుమారి బాబిట్ కి అందజేయమని," అని అంది.

అక్కడితో ఎవరికివారు జారుకున్నారు. ఆంట్ ఎల్ ఒక్కమాట అనలేకపోయింది. పారిపోతున్న బిల్లీ బాబ్ ని చెవులట్టుకుని నిలబెట్టి, యింట్లోకి ఈడ్చుకొచ్చింది. ఆ కుర్రాడు ఏడవడు, తప్పుచేశానని అనడు. తిట్టినా కొట్టినా మొండికేస్తున్న ఈ బిల్లీ బాబ్ ని, ఏమిచేయాలో ఆంట్ ఎల్ కి తోడచంలేదు. ఆమెకి విసుగెత్తుతోంది. ఇంతలో ఆ కుర్రాడు పెరట్లోకి పారిపోయి, చెట్టెక్కి కూచున్నాడు. చచ్చినా యిక్కడే చస్తానుగాని కిందకి దిగను - అన్నాడు. వాళ్ళ నాన్నవచ్చి, భోజనాలవేళ అయింది, దిగమన్నాడు. "బాబువికాదూ, దిగొచ్చి భోంచెయ్యి. నిన్ను ఏమీ అనరు యింక," అని బతిమాలుకున్నాడు తండ్రి. కాని బిల్లీ బాబ్ వినదలుచుకోలేదు.

ఆంట్ ఎల్ చెట్టుమొదట్లో నిలబడి, చెట్టుకి ఆనుకు మంచిమాటలతో బతిమాలింది. మీరుయిక్కడనుంచిపొండి, నాకుతిండీవద్దు, తిప్పలూవద్దు - అనికసురుకున్నాడు బిల్లీ బాబ్. మిమ్మల్నిచూస్తే అసహ్యమేస్తోంది - అన్నాడు.

అమ్మని అలా అనొచ్చా? - అని గదమాయించాడు తండ్రి. ఆంట్ ఎల్ ఏడుపు ప్రారంభించింది. "నిన్ను యింక కొట్టను. నామాటవిను. నాతండ్రివికదూ! కిందికిరా, నాయనా నువ్వుగాకపోతే నాకెవరుదిక్కు?" అని ఆంట్ ఎల్ కన్నీళ్లు పెట్టుకుంటూండగా, చెట్టుఆకులు గలగలలాడాయి. సుపుత్రుడు నెమ్మది నెమ్మదిగా చెట్టుదిగుతున్నాడు. బిల్లీ శాబ్ కిందికి దిగ్గానే, అతని జుట్టులోకి తనవేళ్లని పోనిచ్చి, కుర్ర వాణ్ణి గుండెలకి హత్తుకుంది ఆంట్ ఎల్.

భోజనాలయాక, బిల్లీ శాబ్ పక్కమీదకివచ్చి, బోర్లగిలాపడ్డాడు. కుర్రవాణ్ణిచూస్తే జాలేసింది. అతనికళ్లు విచార సూచకంగాఉన్నాయి మొహంనిండా ఏదోపెద్దదిగులు. మనుషులకి సుస్తీగా ఉన్నప్పుడు పువ్వులు పంపించాలంటారు గదామరి! - అని అన్నాడు. సరిగ్గా అదేక్షైముకి, బయట నుంచి గ్రామఫోను వినిపించింది. చల్లనిగాలి మృదువైనసంగీతాన్ని పట్టుకొస్తోంది. పనసకాయకత్తిలా మంచంమీదపడి పోయిన కుర్రవానికళ్లు, ఆసంగీతం వినేటప్పటికి, తళుక్కున మెరిశాయి. అంతమంచి పిల్ల ఎక్కడాలేదు - అన్నాడు. అటువంటి అమ్మాయికోసం, ఎన్నిగులాబీలుకోసినా, చేతులు నొప్పుపెట్టవట.

ప్రీచర్ స్టాగ్ కూడా అదేమాట అంటున్నాడు. అటు వంటి అమ్మాయికోసం ఎన్నిగులాబీలయినా కోయవచ్చు

నట. బిల్లీ బాబ్ కి మల్లేనే ప్రీచర్ స్టార్ కికూడా మతిపోయింది - ఆపిల్లవిషయమై. కాని, కుమారి బాబిట్ ఈయిద్దరు కుర్రాళ్లనీ గుర్తించనేలేదు. గులాబీలు పంపినందుకు కృతజ్ఞత తెలుపుతూ, ఆఅమ్మాయి ఆంట్ ఎల్ కి ఒకచిన్న చీటీముక్క రాసిపంపింది. ప్రతిరోజూ శుభ్రమైన బట్టలు వేసుకు, ఆయింటి ముంగిట కూచునేది - ఎంబ్రాయిడరీ కుట్టుకుంటూనో, తల దువ్వుకుంటూనో, వెబ్ స్టర్స్ డిక్షనరీ చదువుకుంటూనో కూచునేది. గుడ్ మార్నింగ్ అని మనం ఎవరమైనాఅంటే, తనూ గుడ్ మార్నింగ్ అనేది. కాని, పిల్లలెవరికీ ఆమెని పల్కరించేందుకు ధైర్యం ఉండేదికాదు. వాళ్లుపిచ్చిచేష్టలు చేస్తూ యిటూఅటూ పోతూంటేకూడా, వారిని గమనించనట్టుగానే, తనపనిలో తను నిమగ్నురాలై ఉండేది. సైకిల్ ట్రిక్స్ చేసేవారు, టార్జాన్ ఆటలు ఆడేవారు, కుస్తీలుపట్టేవారు - కాని ఆఅమ్మాయి దృష్టినిమట్టుకు ఆకర్షించలేక పోయేవారు.

చాలామంది అమ్మాయిలు, కుమారి బాబిట్ సంగతేమిటో చూదామని, మిసెస్ సాయర్ యింటిముందునుంచి వెళ్తూండేవారు. కోరా, మేరీ, జానిస్ - వారిలో ముఖ్యులు. కుమారిబాబిట్, మొగపిల్లల విషయంలో ఎటువంటి నిర్లక్ష్యత కనబరిచేదో, ఆడపిల్లల విషయంలోకూడా అలాగే ఉండేది.

ఒకరోజున బిల్లీ బాబ్, ప్రీచర్ స్టార్ ఫాన్సీడ్రెస్సులు వేసుకు వీథిలోకివచ్చారు. చూపులకి యిద్దరూ వెర్రివెంగళా యిల్లా కనిపిస్తున్నారు. కుమారి బాబిట్ వారిని అంతగా గమనించనేలేదు. ఉయ్యాలలో కూచునుంది. మిట్టమధ్యా హ్నసమయమవడంవల్ల వీథినిర్మానుష్యంగా ఉంది. పొట్టిగా గుండ్రంగావున్న ఒక నీగ్రోఅమ్మాయి, కడవనిండా బేరీ కాయలుపోసుకు, సన్నగా పాటపాడుకుంటూ వెళ్తోంది రోడ్డు మ్మట. ఆఅమ్మాయి మోసుకెళ్తున్న కడవని బిల్లీ బాబ్ కింద పడకొట్టాడు. ప్రీచర్ స్టార్ వెనకనుంచివచ్చి, ఆనీగ్రోఅమ్మా యిని ముందుకితోశాడు. నల్లపిల్ల, పాపం, కిందపడిపోయింది; బేరీకాయలన్నీ మట్టిలోకి దొర్లాయి. నల్లపిల్ల పెద్దగా ఏడవ నారంభించింది. ఆ అరుపులూ ఏడుపూవిని, కుమారిబాబిట్ తిన్నగా రోడ్డుమధ్యకివచ్చి, ఆపిల్లని లేవదీసి, అల్లరిపిల్లలతో యిలా అంది: "ఇదా మీరుచేసేపని! స్త్రీలని గౌరవంతో చూడగలవాళ్లే, మానవులనిపించుకుంటారు. ఎబ్బే - యిదేమి అన్యాయం! మెమ్ఫిస్‌లో, న్యూయార్కులో, లండన్‌లో, హాలీవుడ్‌లో, పారిస్‌లో - చదువుకునే పిల్లలు ఈరకంగా ప్రవర్తించరు." కుర్రాళ్లిద్దరూ వెనకగా నిలబడి, జేబుల్లో చేతులుపెట్టుకు, తలవంచుకున్నారు. కుమారిబాబిట్ నీగ్రో అమ్మాయిని తమ యింట్లోకి తీసుకువెళ్తూ, "పట్టపగలు పట్టణవీథమ్మట ఆడది నడవలేకపోవడమా - సిగ్గుచేటు!" అంది ఆపిల్లలకి వినపడేటట్టు.

ఊళ్లోవాళ్ల దగ్గిర రోజల్బా తన సోదరి అనేది కుమారి బాబిట్. మొదట్లో కొందరునవ్వుకున్నారు. కాని, రాను రాను సిస్టర్ రోజల్బానీ, సిస్టర్ బాబిట్‌ని ఆమోదించక తప్పిందికాదు.

ఒకరోజు కుమారి బాబిట్ మాయింటికొచ్చింది. ఆ రోజు ఆదివారంగనక అందరూ చర్చికివెళ్లారు - నేనొక్కణ్ణే యింట్లో ఉన్నాను.

"చర్చిలోని వాసనలు గుబులుపుట్టిస్తాయి. నేను చర్చికి వెళ్లనంతమాత్రాన నా స్త్రీకురాల్ని అనుకోకండి. దేవుడు (God) వున్నాడన్నవిషయం నాకు తెలుసు; దేవుడితోబాటు దెయ్యం (Devil) కూడా ఉంది. దెయ్యాన్ని వశపరుచుకునేందుకు చర్చికి వెళ్లక్కర్లేదు; దెయ్యం ఎంత పాపిష్టిదో, ఎంతచెడ్డదో చెబుతారక్కడ. అదికాదు, - జీసస్‌ని ప్రేమించినట్టే దెయ్యాన్నికూడా ప్రేమించాలి. జీసస్ శక్తివంతుడు; ఆయనమీదగాని విశ్వాసం ఉంటే, మనకి మంచిజరుగుతుంది. మెమ్ఫిస్‌లోని డాన్సింగ్ స్కూలులో నాకు ఆవిధంగానే మంచిజరిగింది...అప్పుడప్పుడు దెయ్యాన్నికూడా వేడుకోకతప్పదు. ఎంచేతనంటే, జీసస్‌కి డాన్సింగంటే యిష్టం ఉండదు. నాకు ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు, పుట్టిన పండగనాడు చిన్నపిల్లలు

గెంతినట్టు, డాన్సు చేయాలనిపిస్తుంది. నేను వరహాలరాసినని అనేవాడు మానాన్న. మానాన్న చేసిన పొరబాటు ఏమిటంటే, అతను డెయ్యాన్ని ప్రేమించలేదు, డెయ్యం అతన్ని ప్రేమిస్తూవుంటే, వూరుకున్నాడు. సరి - నేనెందుకొచ్చానో చెబుతాను. రీడర్స్ డైజస్ట్, పాప్యులర్ మెకానిక్స్, డైమ్ డిటెక్టివ్, చైల్డ్స్ లైఫ్ మొదలుగాగల పత్రికలకి నేను సబ్‌స్క్రిప్షన్ ఏజంటుని (చందాలు పోగుచేసే ఏజంటు). మిమ్మల్ని చందాదారుగా చేరమని అడిగేందుకు రాలేదు. మాయింటి దగ్గిర కాపలా కాస్తూంటారే, ఆయిద్దరబ్బాయిలనీ, నాకు అసిస్టెంటులుగా తీసుకోవడం మంచిదా అని మిమ్మల్ని సలహా అడగడానికి వచ్చాను,'' అంది బాబిట్.

ఆ మర్నాటినుంచీ బిల్లీబాబ్, ప్రీచర్ స్టార్ కుమారి బాబిట్ కోసం పనిచెయ్యడం మొదలెట్టారు. సిస్టర్ రోజ ల్బాకికూడా సాయంగా ఉండేవారు. సిస్టర్ రోజల్బా డ్యుడ్రాప్ కాస్మటిక్స్‌కి ఏజన్సీ తీసుకుంది.

డబ్బు విషయాల్లో కుమారి బాబిట్ చాలా నిక్కచ్చిగా ఉండేది. కుర్రాళ్ళకి రావలసిన కమీషన్ ఖచితంగా వొప్పజెప్పేది. వాళ్లు తనకోసం ఏదయినా ఖర్చు పెట్టబోతే, వొప్పుకునేదికాదు. ''నాలుగు డబ్బులు వెనకేసుకుంటే, కాలేజీకి వెళ్ళి చదువుకోవచ్చు. మీ యిద్దరికీ తెలివితేటలు

పూజ్యం గనక, స్కాలర్‌షిప్ ఎలానూ రాదు. అంచేత, డబ్బు వెనకేసుకోండి,'' అనేది.

పోగుచేసిన డబ్బు అంతా బిల్లీబాబ్ నీకు వొప్పజెప్ప డంలేదు – అన్నాడు ప్రీచర్‌స్టార్ కుమారి బాబిట్‌తో ఒక రోజున.

పచ్చిఅబద్ధం. నన్ను అంతమాట అంటావా? – అంటూ అరుగుమీద నిలబడ్డ ప్రీచర్‌స్టార్‌ని, కిందకితోశాడు బిల్లీబాబ్.

ఇద్దరిమధ్యా ప్రారంభమయిన ఆ కొట్లాటకి కారణం డబ్బుకాదు – ఈర్ష్య.

జారి కిందపడ్డ ప్రీచర్, లేచివచ్చి, బిల్లీని పట్టు కున్నాడు. దుమ్ము తీసుకొచ్చి, అతని కళ్ళల్లోకి నలిపాడు. మేడమీదనుంచి చూస్తున్న మిసెస్ సాయర్ కెవ్వున అరు స్తోంది; సిస్టర్ రోజల్బాకి వారి పోరాటం చూడటం ఆహ్లాద కరంగావుంది. కుమారి బాబిట్ తోటతడిపే నీళ్ళపంపుతీసుకు నీరు తిన్నగా వాళ్ళమీదికి వొదిలిపెట్టింది. వస్త్రాదులిద్దరూ తడిసి ముద్దయిపోయారు. నీటిజల్లువల్ల వాళ్ళకి కళ్ళుకూడా సరిగ్గా కనపడటంలేదు. ప్రీచర్‌స్టార్ తూలుతూ, – నువ్వు నిశ్చయం చేయాలి, డియర్ – అన్నాడు.

"ఏమి నిశ్చయం చేయాలి?'' అంది కుమారిబాబిట్ వెటకారంగా.

మేము యిలా పోరాడుకు, ప్రాణాలు తీసుకోవడం, నీకు యిష్టమా? మా యిద్దరిలో, ఎవరిని నువ్వు ప్రేమిస్తు న్నావో, నిశ్చయంచేయాలి? – అన్నాడు ప్రీచర్ స్టార్.

"ప్రేమించడమా? మీలాటి పల్లెటూరి సరుకుని ప్రేమించడమా? మీకు మాటా మర్యాదా తెలియదే! స్త్రీని పూజ్యభావంతో చూడాలనే జ్ఞానంకూడాలేదే! అలాటి మిమ్మల్ని, ఎవరు ప్రేమిస్తారు? నాకు ప్రేమావొద్దు, గీమావొద్దు. ఒకవేళ నేను ఎప్పుడైనా ప్రేమించినా, మీలాటివాళ్లని మట్టుకు ప్రేమించను," అంది కుమారి బాబిట్.

ప్రీచర్ నేలమీాదవుమ్మేసి, తమమధ్య ఏమీ జరగనట్లే బిల్లీబాబ్‌తో – రా, పోదాం – అన్నాడు. ఇద్దరు స్నేహితులుమధ్య తంపులు పెడదామనుకుంది. ఆమెకి ప్రేమ అక్కర్లేదట – అన్నాడు. బిల్లీబాబ్ అతనితో చెట్టాపట్టా లేసుకుపోవలసిందే, – కాని ఏదోజ్ఞాపకం వచ్చినవాడిలా ప్రీచర్‌ని చటుక్కున విదిలించికొట్టాడు.

ఇద్దరూ సరిపెట్టుకోవలసిందే, కాని సరిపెట్టుకోలేకపోయారు. అంతమాత్రాన, వెనకటి స్నేహితాన్ని మర్చిపోనూ లేకపోయారు. ద్వేషమూ, ప్రేమా సమానఫాయీలో నడుస్తాయి.

కుమారి బాబిట్ సమక్షంలో బిల్లీ తనబాధలు మర్చి

పోయేవాడు. ఆమె, సిస్టర్ రోజెల్బా బిల్లీబాబ్‌ని యిప్పుడు ఆప్యాయంగా పల్కరిస్తున్నారు. ముగ్గురూకలిసి బ్రిడ్జి ఆడు తున్నప్పుడు, అతను చెప్పేవి అబద్ధాలని తెలిసికూడా బిల్లీనే నెగ్గనిస్తూ వుండేవారు. మంచిరోజులు తొందరతొందరగా వెళ్లిపోతాయి. స్కూళ్లు తెరిచారు.

స్కూలు అధికారి కుమారి బాబిట్ దగ్గరకొచ్చి, ఆ అమ్మాయిని తమ స్కూలులో చేరమన్నాడు.

నాకు మీరు నేర్పేదేమిటి? డాన్సింగ్‌తప్ప నేను నేర్చుకోదగ్గది ఏమీలేదు, మీ స్కూలులో డాన్సింగ్ లేదామె – అంది కుమారి బాబిట్.

నిర్బంధ విద్యాశాసనాన్ని ఈ పదేళ్లబాల, ఈవిధంగా ఉల్లంఘించడమేనా!! – అని వాదప్రతివాదాలు చెల రేగాయి. బిల్లీబాబ్ ఎప్పుడూ కుమారి బాబిట్ పక్షం. ఆమెపక్షం వహించినందుకు, అప్పుడప్పుడు చావుదెబ్బలు తింటూండేవాడు. అయినా, అతనికి సంతోషమే!

“నాగురించి మనుషులు చెడ్డగా అనుకుంటూవుంటే నువ్వు నాపక్షం వాదించకు. ఆ అనేవాళ్లందరికీ నాలో ఒక ప్రత్యేకత వుందనితెలుసు. అందుకనే అంటున్నారు,” అనేది కుమారి బాబిట్.

ఆమె మాటలు నిజమే. మనలో ఏదో ఒక ప్రత్యే

కత వున్నప్పుడే, మనుషులు మనగురించి మాట్లాడు కుంటారు. కుమారి బాబిట్‌లోని ప్రత్యేకత, మానీఫాక్స్ మా ఊరు వచ్చేదాకా, మాకు తెలియదు. మానీఫాక్స్ ఫిబ్రవరిలో వచ్చాడు. కళ్ళు మిరుమిట్లు గొలిపే డాన్సులూ, యిరుగూ పొరుగూ పాల్గొనే అమెచూర్ నాటకం ప్రదర్శిస్తా నన్నాడతను. డాన్సుకీ, ప్రదర్శనకీ ప్రయిజులుకూడా ఉన్నాయి. మొదటి బహుమతి పొందిన డాన్సర్‌ని హాలీ వుడ్ వారికి సిఫారసు చేస్తాడు మానీఫాక్స్.

ప్రదర్శన గురువారంనాటికి ఏర్పాటయింది. టికెట్టు ఖరీదు ఒక డాలరు. మానీఫాక్స్ కంపెనీవాళ్ళు ఊళ్ళోకి వచ్చినప్పటినుంచీ, మా ఊరికి నూతనజీవం వచ్చినట్టుంది. మానీఫాక్స్‌కి నాటకం కంపెనీ ఒకటే కాదు - యింకా చాలా వ్యాపారాలు ఉన్నాయి. ఎంప్లాయిమెంటు బూరో ఒకటి ఉంది. 150 డాలర్లుకట్టి, ట్రయినింగ్ పొందిన ఉత్సాహ వంతులకి, ఓడలమీద మంచిమంచి ఉద్యోగాలు దొరుకు తాయి. యూడా, తనభర్త టూంబ్‌స్టోన్‌కని నిలవజేసిన 150 డాలర్లు, కొడుకుకోసం యిచ్చింది ; అలాగే ఎసీట్రంప్ నాన్న, పత్తిపంట ముందుగా అమ్మి, 150 డాలర్లు కట్టాడు.

మొట్టమొదట మానీఫాక్స్ స్టేజిమీదకొచ్చి పాత నవ్వుతాలు ఓ పదిచెప్పి, ప్రేక్షకుల్ని నవ్వించాడు.

కుమారి బాబిట్ స్టేజిమీదికి రావడానికి ముందు,

పదకొండుగురు పోటీదారులు, తమ డాన్సు చూపించారు. చివరికొచ్చింది బాబిట్. ఆమె రావడమే నీలమేఘంలా వచ్చింది. బిల్లీబాబ్ కేగాక, ఆంట్ఎల్ కికూడా, ఆమె ఎంతో ముద్దుగా కనిపించింది; ప్రదర్శన నేత్రోత్సవంగా ఉంది; ముఖ్యంగా కొవ్వొత్తులతో చేసినడాన్సు ప్రేక్షకుల్ని తన్మయపరిచింది. మొదటి బహుమతి కుమారి బాబిటుదే అని అందరూ అనుకున్నారు.

మానీఫాక్స్ ఆ సంగతి స్పష్టంచేశాడు. కుమారి బాబిట్ కి గొప్పభవిష్యత్తు వుందనీ, తానామెని హాలీవుడ్ వారికి సిఫారసు చేస్తున్నాననీ ప్రేక్షకులతో అన్నాడు. అందరూ ఎంతో సంతోషించారు.

పోస్టులో తెలియబరుస్తాను - అని ఉద్యోగాలు యివ్వ వలసిన కుర్రవాళ్ళకీ, కుమారి బాబిటుకీ చెప్పి, మర్నాడు అక్కడనుంచి వెళ్ళిపోయాడు మానీఫాక్స్.

వారం, పదిరోజులు, పదిహేనురోజులు, ఉత్తరం లేదు, పత్తరంలేదు. "నేను చెప్పలేదూ, వాడు వొట్టి మోసగాడు," అంది పోస్ట్ మిస్ట్రెస్ పాటర్సన్, - పదిహేను రోజులబట్టీ ప్రతిరోజూ పోస్టాఫీసుదగ్గిర గుమిగూడుతున్న పిల్లలతో.

పదిహేనురోజులు గడిచాక, కుమారి బాబిట్ ముందుకి వురికింది. కొందరు పిల్లల్ని పోగుచేసి, కర్తవ్య మేమిటో ఆలోచించింది. కర్తవ్యపాలనకి కావలసినడబ్బు అప్పటికప్పుడు పోగయింది.

కుమారి బాబిట్ ఒక్క వారంలో మూడువందల ఉత్తరాలు, దక్షిణ నగరాలలోని షెరీఫ్‌లందరికీ, మానిఫాక్స్ పోలికలుచెబుతూ రాసింది. అంతేకాదు, పెద్ద పట్నాలలోని పత్రికలన్నిటికీ సంపాదకలేఖలు రాసింది. ఈ బృహత్ప్రయత్నంవల్ల వసంతకాలంనాటికి, మానీ ఫాక్స్ పట్టుబడ్డాడు. నిష్కారణం డబ్బు పోగొట్టుకున్న కుర్రాళ్లలో నలుగురికి యునైటెడ్ ఫ్రూట్ కంపెనీ ఉద్యోగాలు యిచ్చింది; సన్‌బీమ్ గరల్స్ ఆఫ్ అమెరికా అను సంస్థ వారు కుమారి బాబిట్‌కి బంగారుపతకం బహూకరించారు.

మానీఫాక్స్‌వల్ల మోసగింపబడ్డ కుర్రాళ్ళందరికీ వారం రోజులక్రితం చెక్కులువచ్చాయి. వారిపైకం వారికి వచ్చేసింది. వారందరినీ ఉద్దేశిస్తూ కుమారి బాబిట్ యిలాఅంది: "నేను హాలీవుడ్ వెళ్ళేందుకయే డబ్బు మీరు పెట్టుకోండి, నేను స్టార్‌ని అయాక, నా సంపాదనలో పదోవంతు, మీకు యిచ్చేస్తాను. మీరు పోయిందనుకున్న డబ్బుగదా, మీ చేతుల్లోకి వచ్చింది. అంచేత, నాకీవిధంగా మీరు సాయ పడవచ్చు."

ఆ డబ్బుని ఆవిధంగా వినియోగపరచాలని ఏఒక్కరికీ లేదు. కాని కుమారి బాబిట్ కోరినప్పుడు, కాదనికూడా ఎవరూ అనలేరు.

సోమవారంనుంచీ తెగవర్షం. పగటివేళ ఒకపక్క ఎండ కాస్తూండగానే, వర్షం. ఇక, రాత్రివేళ ఉరుములతో కూడా. బిల్లీబాబ్‌కి సర్వం శూన్యంగావుంది. కుమారి

బాబిట్ వెళ్ళిపోతుందనే ఆలోచన అతను భరించలేకుండా వున్నాడు. పట్టున పదమూడేళ్లు - కాని వైరిమమతలో పడ్డాడు. అర్ధరాత్రి సంగీతం యిక వినిపించదు; మధ్యాహ్నపు నీడల మార్దవం యింక తనకంటికి కనపడదు.

ఆమె నవ్వుతూ బిల్లీబాబ్ దగ్గిరికి వచ్చింది; అతని చెయ్యి తనచేతుల్లోకి తీసుకుంది; అతన్ని ముద్దెట్టుకుంది కూడా. "నేను చనిపోతున్నానా - ఎందుకా విచారం! నువ్వు అక్కడికివస్తావు; మనిద్దరం గిరిశిఖరం ఎక్కుతాం; నువ్వూ నేనూ రోజల్బా ముగ్గురం ఎంతో హాయిగా ఉంటాం." ఆ ప్రకారం జరగదని బిల్లీబాబ్ కి తెలుసు. అందుకనే ఆ తపనా, ఆ ఆవేదనా!

నిన్న పొద్దున్నంతా వర్షమే! మధ్యాహ్నంవేళ సూర్యుడొచ్చాడు. సూర్యకాంతితో గాలికి పరిమళం వచ్చింది. ఆంట్ఎల్ గులాబీలు మళ్ళీ పూస్తున్నాయి. కుమారి బాబిట్ కి గుడ్ బై చెబుతున్నప్పుడు, ఆ పువ్వులు కోసి యివ్వమంది ఆంట్ఎల్ బిల్లీబాబ్ తో.

మధ్యాహ్నమంతా కుమారి బాబిటు, వాళ్ల ముందు వాకిట్లోనే కూచుంది. వీడ్కోలుచెప్పే మనుషులు వస్తూ పోతూవున్నారు. కుమారి బాబిటు తెల్లటిబట్టలేసుకు, తెల్లటి గొడుగు చేతబుచ్చుకుంది. సిస్టర్ రోజల్బా నిముష నిముషానికీ కన్నీళ్లు పెట్టుకుంటోంది.

చాలాసేపటిబట్టి ప్రీచర్ స్టార్ ఆచుట్టుపక్కలే తచ్చాడుతున్నాడు. ఒకసారి డబ్బులెగరెయ్యడం, ఒకసారి చెట్టు

చాటున దాక్కోడం - ఈ ప్రకారంగా. ఎవరైనా తనని చూస్తారేమో అను మొహమాటంతో, తప్పుకు తప్పుకు తిరుగుతున్నాడు. బస్ యింకా యిరవై నిముషాలకి వస్తుందనగా, అతను మా గేటునానుకు నిలబడ్డాడు. బిల్లీబాబ్ యింకా పువ్వులుకోస్తున్నాడు, ఎన్ని పువ్వులుకోశాడో లెఖ్ఖ లేదు. గాలి వాటిపరిమళంతో బరువుగాఉంది. బిల్లీ బాబ్ తలఎత్తేదాకా, ప్రీచర్ అతనివంక, చూస్తూనేఉన్నాడు. అలావాళ్లు ఒకరినొకరు చూసుకుంటూండగా హరివిల్లు విరిసింది, సన్నని తుంపర ప్రారంభమయింది. మాటాపలుకూ లేకుండా ప్రీచర్ బిల్లీబాబ్ దగ్గిరికి వెళ్లి, అతనికి సాయంచేయడం మొదలెట్టాడు. గంపెడుపూలూ రెండుపూలబంతులుగా మార్చుకు, గేటుదగ్గిరకొచ్చారు. పూలమధ్య కప్పడిపోయిన చంద్రబింబాల్లాటి మొహాల్ని చూసి, రెండు చేతులూ చాచుకు, గబగబా రోడ్డుకి అడ్డంగా పరిగెత్తుకుంటూవస్తోంది కుమారిబాబిటు. ఆపైన ఏమిజరుగుతుందో, మీరు ఊహించుకోగలరు. వర్షం పడుతున్నప్పుడు, పిడుగులు ఎంత భీకరంగా ఉంటాయో, అలాఅరిచాం. కాని ఆమెకి వినపడలేదు. గులాబీలవైపు పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆరుగంటలు బస్ ఆమెమీదుగా వెళ్లింది.